# సమర్థ సద్గురు

## ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా

ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206

web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com



Volume 28 Issue 5
No. of Pages 48
JANUARY 2009

| | | |
|---|---|---|
| 5సం॥లచందా | రు. | 250.00 |
| 2సం॥ల చందా | రు. | 120.00 |
| సంవత్సర చందా | రు. | 60.00 |
| విడిప్రతి వెల ..... .. | రు. | 5.00 |

M.O లేదా బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:
మేనేజరు
A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్
సమర్థసద్గురు మాగజైన్
శ్రీకాళీగార్డెన్స్-522508

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,

ఈ నెలనుండి

**శ్రీసద్గురునాధునిదివ్య చరిత్ర-1**

ధారావాహికంగా వెలువడుతున్నది..

**ఈ సంచికలో....** **పేజీ**

# భద్రవాక్యం

**అయమాత్మా బ్రహ్మ**

అథర్వణవేద సారాన్నంతటినీ మన పెద్దలు ఈ మహావాక్యంలో అందించారు. ఈ మంత్రం అథర్వణవేదంలోని మాండూక్యోపనిషత్తులోను నృసింహపూర్వతాపినీ యోపనిషత్తులోను కనిపిస్తున్నది.

మనకు దగ్గరగా ఉన్న దానిని 'ఇది' అని, దూరంగా ఉన్నదానిని 'అది' అని చెప్పటం వ్యవహారంలో ఉన్నది. సంస్కృతభాషలో సమీపంగా ఉన్నదానిని (ఇది లేదా ఈ అని అర్థం వచ్చే) **అయం** అనే పదంతో సూచిస్తారు. పై మంత్రంలో ఉన్న మూడు పదాలలోని **'అయం ఆత్మా'** అనే పదాలకు ఈ ఆత్మ అని అర్థం. వేదాంత పరిభాషలో మన కన్న బాహ్యంగా ఆత్మవస్తువును చెప్పేటప్పుడు బ్రహ్మము అని, మనలో మన స్వరూపంగా ఉన్న ఆత్మ వస్తువును ఆత్మ లేదా ప్రత్యగాత్మ అని వ్యవహరించటం వాడుకలో ఉన్నది. **అయమాత్మా** లేదా ఈ ఆత్మ అంటే మనలో తానుగా ఉన్న ప్రత్యగాత్మ అని అర్థం.

**స్వప్రకాశాఽపరోక్ష త్వమయ మిత్ర్యుక్తితో మతమ్ ।**
**అహంకారాది దేహాం తాత్ప్రత్యగాత్మేతి రీయతే ॥**

అహంకారం మొదలు స్థూలదేహ పర్యంతము, నా అహంకారము, నా దేహము అని ఏ చైతన్యం తెలిసికొంటున్నదో ఆ ప్రత్యగాత్మయే ఈ అయం ఆత్మా అనే పదాలకు వాచ్యార్థంగా చెప్పబడుతున్న స్వయం ప్రకాశము, అపరోక్షము అయిన ఆత్మ. ఇంద్రియ గోచరము అయ్యే ఈ సమష్టి జగత్తుకంతటికి అధిష్ఠానమైన బ్రహ్మమే, ఈ **అయమాత్మా** లేదా **ప్రత్యగాత్మ** అనే పదానికి లక్ష్యార్థం. ఆ ఆత్మస్వరూపుడవే నీవు.

సద్గురుదేవులు తమను ఆశ్రయించిన అధికారి అయిన శిష్యునకు ఈ నాలుగు మహావాక్యములతో నీవే సచ్చిదానంద స్వరూపవమై, అద్వితీయమైన ఆత్మస్వరూపుడవు, వర్ణములు కాని, ఆశ్రమములు కాని, వర్ణాశ్రమ ధర్మములు కాని నీకు లేవు. నీవు అసంగుడవు. కాలత్రయములో కాని అవస్థాత్రయములోకాని, ఎప్పుడూ నీవు జీవుడవు కావు. నీకు ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మలు లేవు. అఖండైక రస స్వరూపము, సుఖస్వరూపమైన ఆత్మవే నీవు అని బోధించి, హస్తమస్తక సంయోగంతో వారికి అజ్ఞాన నివృత్తి చేసి, వారిని తమ సంపూర్ణానుగ్రహమునకు పాత్రులను చేస్తారు. దానితో అధికారులైన శిష్యులకు మోహం నశించి వారు కృతకృత్యులు అవుతారు. *

# అమ్మ ఆశీస్సులు

2009 ఆంగ్ల సంవత్సరము మొదలైనది. శ్రీసద్గురుదేవులకు సర్వాంతర్యామి అయిన సృష్టిలో ఉన్న అణువణువునకు శిరసా ప్రణమిల్లుతూ 2008నకు వీడ్కోలు ధన్యవాదాములు తెలియ చేసుకుంటున్నాను.

2009లో మిగిలేది 2. భగవంతుడు - భక్తుడు, గురుదేవుడు - శిష్యుడు. అప్పుడే బ్రహ్మవిద్యను అనుభవించగలము. ద్వైతము ఇక్కడ మాత్రమే ఉండాలి.

**భావాద్వైతం సదా కుర్యాత్ క్రియాద్వైతం న కర్హిచిత్।**
**అద్వైతం త్రిషులోకేషు నాద్వైతం గురుసన్నిధౌ ॥**

అన్నారు. ఇక్కడ శ్రీసద్గురుదేవుల సన్నిధిలో ఇలా ఉన్నప్పుడే ఎన్నెన్నిటినో కాదు కాదు ఉన్న ఒక్కటినీ అనుభవించగలము.

ఈ నూతన సంవత్సరము ప్రతి ఏడాది సాధకులైన వారికి ధనుర్మాస దీక్షలో ఆండాళ్ళు తల్లిని, ఆంజనేయ స్వామిని, ఎందరెందరో భగవద్భక్తులను స్మరించుకుంటూ ఎన్ని సంవత్సరాలు జరిగిపోతున్నవో, కొత్త అనుకునేవి వస్తున్నవో మన చిన్నప్పటి నుండీ చూస్తూనే ఉన్నాము. అంటే తాను మాత్రం ఒక్కటే.

ఎన్ని రానీ, పోనీ చలియించని భక్తునికే కలదు స్థానమన్నది శ్రీ సద్గురు పాదము. శ్రీసద్గురుదేవుల ముఖస్తుగా ప్రవహించిన పదము. అందుకనే మార్కండేయుడు కూడా **చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వైయమః** అన్నారు. కాలాతీతమైన శక్తి శ్రీగురుదేవునిది. ఆ నీడలో ఉన్న మనకు తక్కువేమిటి? అటువంటి నిర్భయముతో మనందరము శ్రీగురుదేవులను ఆశ్రయించి అట్టి శక్తిని, భక్తిని, అఖండ సాధనా సంపత్తిని పొందెదముగాక! ఇటువంటి నూతన సంవత్సరము నుండి ఇంకా ఇంకా ఆత్మోన్నత్తిని సాధించి బ్రహ్మానంద సామ్రాజ్యాన్ని అనుభవించుదుము గాక!!

- మీ అమ్మ

# సంపాదకీయం

సమర్థ సద్గురు ఆధ్యాత్మిక పత్రికను అభిమానిస్తూ, ఆదరిస్తూ పత్రిక సమర్థవంతంగా నడవటానికి చేయూతనందిస్తున్న పాఠకులకు, భక్తులకు అందరికీ నూతన ఆంగ్ల సంవత్సరాది (2009) శుభాకాంక్షలు!

అప్పుడే ధనుర్మాసంలో సగంపైగా గడచింది. ఆశ్రమంలో శ్రీరామ లింగేశ్వరస్వామివారి ఆలయ ప్రాంగణంలో చూతతరు ఛాయలలో ప్రతిరోజూ ధనుర్మాస కార్యక్రమాలు ఎంతో భక్తిభరితంగా, జ్ఞానప్రబోధకంగా జరుగుతున్నాయి. తిరుప్పావైలోని పాశురాలకు జపమాల ప్రసాదగారి వివరణ వినూత్నంగా ఉన్నది. డా॥వెంకట రమణ ప్రసాద్‌గారు మహాభారతం (సంస్కృత మూలమేకాక కవిత్రయం వారి మహాభారతం) నుండి, శంకర భగవత్పాదా చార్యులవారి ప్రబోధ సుధాకరం నుండి, ఇంకా ఎక్కడెక్కడో మూల మూలల నుండి త్రవ్వుకొని వచ్చి, సద్గురుదేవుల లీలతో సమన్వయ పరుస్తూ చేస్తున్న భాగవతంలోని దశమ స్కంధ ప్రవచనం ఎంతో విజ్ఞానదాయకంగా ఆకర్షణీయంగా ఉన్నది.

ఉత్తరాయణంతోపాటు మనందరికీ ఎంతో ఆనందదాయకమైన సంక్రాంతి పండుగ ఈనెలలోనే వస్తుంది. ఆశ్రమంలో ఈనెల 13వ తారీఖున భోగిపండుగ ఎంతో వైభవంగా జరుగుతుంది. శ్రీసద్గురుదేవుల మూర్తికి భోగి పళ్ళు పోసే కార్యక్రమంలో పాల్గొని, ఆ పండ్లను ప్రసాదంగా స్వీకరించటానికి రాష్ట్రంలోని నాలుగు మూలల నుండేకాక, ఎక్కడెక్కడో ఉండే భక్తులందరూ అసంఖ్యాకంగా ఆనాడు ఆశ్రమానికి వస్తారు.

శ్రీవిజయేశ్వరానంద ప్రసాద్‌గారు ఎంతో పరిశ్రమించి, శ్రీమాతాజీవారి ఆశీస్సులతో రచించిన సద్గురునాథుల దివ్యచరిత్ర మొదటి భాగం ఈ మాసం నుండి సమర్థ సద్గురు మాసపత్రికలో ధారావాహికంగా వెలువరిస్తున్నాము. ముందుగా ఈ సంచికలో శ్రీమాతాజీవారి ఆశీస్సులను ప్రచురించటం జరిగింది.

భక్తులందరికి మరొక్కసారి నూతన ఆంగ్ల సంవత్సర శుభాకాంక్షలతో పాటు సంక్రాంతి, శుభాకాంక్షలను తెలుపుకుంటూ.............

గౌ॥సంపాదకుడు

# బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

అన్నిటికన్న గొప్పదేది? విలువైనదేది? కాలము. చనిపోయినవాడు ఎలా తిరిగి రాడో అలాగే జరిగిపోయిన కాలం క్షణం కుడా తిరిగిరాదు. మానవుని జీవితకాలం చాలా చిన్నది. ఒక సంవత్సరానికి 8760గంటలు. మానవుడికి పూర్ణాయుర్దాయం అంటే నూరు సంవత్సరములు అంటే 876000గంటలు. అందులో నిద్రకు గాను 438000గంటలు పోతుంది. మిగిలిన 438000 గంటలలో కాఫీకి, ఇడ్డెనలకు కాలక్షేపానికి, చీట్లపేకకు 219000 గంటలు తీసివేసినా మిగిలిన కాలం నిత్యజీవన వృత్తి చేసుకోవటానికి, అవసరమైన పనులు చేసికోవటానికి సరిపోతుంది. ఇక జీవితంలో మైనస్‌కాలం మిగిలింది. ఇంత మైనస్ జీవితంలో కూడా పరమాత్మను తెలిసికోవటానికి సదవకాశం ఉంది. నీలో ఉన్న సద్వస్తువును నీవు తెలిసికోవటానికి ఛాన్స్ ఉంది. అన్ని అవయవాలలో ప్రధానమైనది మనస్సు. దానిని గాఢ విశ్వాసంతో భగవానుని చరణాలకు తాకించు. అది ఆధ్యాత్మిక కరెంట్. తాకిన వెంటనే దాని ద్వారా నీకు కాంతి వస్తుంది. కాంతి స్వరూపుడవు అవుతావు. ఆచార్యుడు అంటే గురుదేవుడు ప్రసాదించిన లక్ష్యార్థము ఏది ఉందో దాని యందు నీ మనస్సును ఉంచి ధ్యానించిన కొలది ఆ ధ్యానాగ్నిలో నీ కర్మబీజాలన్ని దగ్ధమైపోతాయి. గురు కృపకు పాత్రుడవై ఆత్మానందానుభూతిని పొందగలుగుతావు. గురుదేవుని ఋణం తీర్చుకునేందుకు అదొక్కటే మార్గం. గాఢవిశ్వాసం కావాలి. గురువాక్య పాలన చేయాలి.



నారాయణుడు ముక్తిస్వరూపుడు, లక్ష్మీ మనోహరుడు, సర్వవ్యాపకుడు. ఆయన దయను సంపాదించాలంటే "ఓం నమో నారాయణాయ" అనే అష్టాక్షరీ మహామంత్రాన్ని విశ్వాసంతో శ్రద్ధగా జపించాలి. నారాయణుడే

రాముడు; కృష్ణుడు; ప్రణవస్వరూపుడు; పరమేశ్వరుడు; జగన్మాత; గురుదేవుడు. సర్వము నారాయణ మయమే. ఈ అష్టాక్షరీ మహామంత్రాన్ని నిరంతరము జపిస్తూ ఏ పనిచేసినా, అది ఆటోమాటిక్‌గా జరుగుతుంది. మనము నిత్యం తీసికొనే శ్వాసతోపాటు సోzహం సోzహం అని అజపగాయత్రి జరుగుతూనే ఉంటుంది. శ్వాస ఉన్నంతసేపే హార్ట్ పనిచేస్తుంది. రక్తం ప్రసరిస్తుంది. బాహ్య, అంతరింద్రియాలు పనిచేస్తాయి. శ్వాస ఆగిపోయిన ఆ క్షణంలోనే ఇవన్నీ ఆగిపోతాయి. ఈ శరీరము కారువంటి ఒక యంత్రాంగం. పెట్రోల్‌తో కారు, కరెంట్‌తో ఫ్యాన్ పనిచేసినట్లుగానే, సోzహం అనే శ్వాసతో ఈ శరీరం పనిచేస్తుంది. మహాత్ములు తమ శ్వాసతోపాటు 'ఓం నమో నారాయణాయ' అని జపం చేస్తారు. వారి ముఖం ఎంతో తేజస్సుతో ప్రకాశిస్తుంది. అక్కడ అజ్ఞానమనే చీకటి ప్రవేశించే వీలులేదు. తేజోస్వరూపుడైన భగవానునిలో మనస్సు లీనమై అదికూడా కాంతి స్వరూపాన్ని పొందుతుంది. అంతరింద్రియాలు, బాహ్యేంద్రియాలు ఆ కాంతినే చూస్తాయి. అట్టి జ్ఞాన కాంతిని సందర్శిస్తేనే సుఖశాంతులు కలుగుతాయి. నీచ భావాలు హరిస్తాయి. చిన్మయానందం పొందుతారు. ఆ కాంతి సత్యమైనది, నిత్యమైనది. ఆ జ్యోతి ఒక్క క్షణం ఉండి, ఒక్క క్షణం ఆరేదికాదు. ఎల్లప్పుడూ తాను స్వయంగా ప్రకాశిస్తూ అన్నిటినీ ప్రకాశింపజేస్తుంది. అదే ఆత్మజ్యోతి. ఆదే నారాయణ స్వరూపం.

ఒక పోలీసు సూపరింటెండెంట్ ఉన్నాడు. ఆయన కుమార్తెకు వివాహం చేశాడు. వివాహం జరిగిన కొద్దిరోజులలోనే ఆషాఢమాసం అడ్డు వచ్చింది. ఆ ఆషాఢమాసంలో అత్తవారింటి గడప తొక్కరాదని ఒక నియమం ఉంది. అయితే ఇప్పుడు అది బి.సి. నాటి ఆచారంగా భావిస్తున్నారు. ఇప్పటి కాలం పెళ్ళికొడుకులకి, పెళ్ళి కూతుళ్ళకి అత్తవారిల్లు తొక్కే అవసరమూ లేదు, ఆషాఢ మాసాలు అడ్డురావనుకోండి. అల్లుడు వస్తున్నట్లుగా మామగారికి టెలిగ్రాం ఇచ్చాడు. ఇంతలో అదే రైలులో ఛీఫ్ మినిస్టర్ వస్తున్నట్లు మన సూపరింటెండెంట్ గారికి ఫోన్ వచ్చింది. ఆయన హడావిడిగా స్టేషన్‌కు బయలుదేరాడు. స్టేషన్‌లో రైలు ఆగగానే సి.ఎమ్ కోసం చూస్తుంటే అల్లుడు కనబడ్డాడు. బెల్‌బాటం పాంట్ వేసికొని వస్తున్నాడు. అతని కళ్ళు తన భార్య కోసం వెతుక్కుంటున్నాయి. కాని మామగారు ఒక్కరే కనిపించారు. అల్లుడు ఎక్కడ అలుగుతాడో అనే భయంతో ఏదో రెండు మాటలు మాట్లాడి 'ఇంటి దగ్గర అమ్మాయి ఎదురు చూస్తోంది. ఆ కారులో వెళ్ళు' అని పంపిస్తాడు.

ఏం మాట్లాడుతున్నా ఆయన కళ్ళు సి.ఎమ్. పైనే ఉంటాయి. ఛీఫ్ మినిస్టర్ రైలు దిగేసరికి ఈ తతంగమంతా ముగించుకుని ఆయన రైలు దిగే లోపల ఈయన శాల్యూట్ కొట్టకపోతే ఉద్యోగం ఊడుతుంది. అలాగే మనం ఏ పని చేస్తూన్నా మనస్సు లక్ష్యార్థంపైనే ఉంచాలి. మన తపన ఆషాఢమాసం అడ్డు వచ్చినప్పుడు కలుసుకోలేకపోయిన వధూవరుల తపన వలె ఉండాలి. అటువంటి తపనయే ఒక తపస్సుగా, ఒక యజ్ఞంగా మారుతుంది. తేజస్సు దర్శన మవుతుంది. 'ఓం నమో నారాయణాయ' అనే మంత్రం జపించిన నరుడు నారాయణుడు అవుతాడు. మంత్ర స్వరూపాన్ని మనస్సు పొందుతుంది. తదాకార రూపం ధరిస్తుంది. ఆ హోమంలో త్రిగుణాలు, సంకల్పాలు, కోరికలు, కామక్రోధాది వికారాలు అన్నీ ధ్యానాగ్నికి ఆహుతి అయిపోతాయి. హాయిగా శాంతిగా ఉంటుంది. విరేచనాల మందు వేసుకుంటే మొదట కడుపులో తిప్పుతూ ఎంతో వికారంగా ఉంటుంది. మలపదార్థమంతా వెళ్ళిపోయిన తరువాత ఎంతో హాయిగా ఉంటుంది. అలాగే మన మనోవికారాలకు, అశాంతికి మూల కారణమైన సమస్త భావాలను, గుణాలను, సంకల్పాలను నారాయణ మంత్రం హరించి పవిత్రమైన భావాలను మనస్సులో ఉత్పన్నం చేస్తుంది. గులాబి పువ్వు సుగంధాన్ని ఇచ్చినట్లుగానే భగవద్ధ్యానతో ఉన్న మనస్సు నుండి పవిత్రభావాలే వస్తాయి. అవి తనకు, ఇతరులకు కూడా ఏ హానీ చేయకుండా ఎంతో మేలు చేస్తాయి. కాని నీచ గుణాలు, దుష్ట సంకల్పాలతో కూడిన మనస్సు నుండి వచ్చే భావాలు మురికిగుంట నుంచి వచ్చే దుర్వాసన ఊపిరి తిత్తులను పాడుచేసి రోగాలను కలిగించినట్లు అశాంతిని, దుఃఖాన్ని కలిగిస్తాయి.

స్వార్థంతో, రాగద్వేషాలతో ఉన్న మానవుడు తన దారాపుత్రాదులనే నమ్మలేడు. ప్రతి ఒక్కరినీ అనుమానిస్తాడు. ఈ అనుమానం అనే రోగం వలన అతని నోటి నుండి వచ్చే వాక్కు ఎంతో పరుషంగా బాధ కలిగించేదిగా ఉంటుంది. అందువలన మానవుడు తన మనస్సును రాగద్వేషాలకు లోనుకానీయకుండా జాగ్రత్త పడుతూ తన వాక్కు సత్యంగా, నిర్మలంగా, పవిత్రంగా ఉండేటట్లు చూసుకోవాలి. వాగ్దోషం వల్ల మానవుడు ఎంతో నష్టానికి కర్మకు గురి అవుతాడు. భగవన్నామాన్ని స్మరించిన కొలది వాక్కు, మనస్సు కూడా పవిత్రంగా మారతాయి. అందరిని భగవత్స్వరూపంగా భావించి ప్రేమించగలుగుతాడు. అందరి ప్రేమను తాను జుర్రుకో గలుగుతాడు.

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి) -జపమాల ప్రసాద

మనస్సులో మార్పు తెచ్చేది భగవన్నామ స్మరణ. అది మనస్సులోని కలుషాన్ని హరించి శుద్ధంగా మార్చివేస్తుంది. శుద్ధ మనస్సులో భగవద్రూపం గోచరమవుతుంది. మన అంతరంగంలో ఉన్న ఆత్మారాముడే ఇన్ని అనంత రూపాలుగా వెలుగుతున్నాడని గుర్తించగలుగుతాము.



ఎన్ని విధాలుగా చెప్పుకున్నా, ఉన్నది ఒకటే అనంత శక్తి. అన్ని రూపాలు, అన్ని నామాలు ఆ శక్తివే. 'ఏకం సత్ .....విప్రాః బహుధా వదన్తి' అందుకనే నేమో శివుడి గుడిలో రామనామం ప్రతిధ్వనిస్తోంది. 'యథాన్తరం న పశ్యామి। తథామే స్వస్తిరాయుషీ' - శివకేశవులకి భేధం లేదని తెలుసుకున్నవాడికి పూర్ణాయువు కలుగుతోందని చెబుతోంది స్కందోపనిషత్.

ఈ దేహానికి షడూర్మ్మలున్నాయి. పుట్టిన వాళ్ళందరూ వెళ్ళిపోవలసిందే అని తెలుసు. ప్రసూతి వైరాగ్యం, పురాణవైరాగ్యం, శ్మశాన వైరాగ్యం అందరికీ వస్తూ ఉంటాయి. కాని అవన్నీ తాత్కాలికమే. దేహాభిమానం అనే వాసన ఫారిన్ సబ్బులతోను, కుంకుడు కాయలతోను వదలదు. అది కేవలం భగవన్నామం తోనే వదులుతుంది. ఆ భగవన్నామమనేది సత్య గురువుల వద్ద లభిస్తుంది.

గురుదేవుడు మనలో లక్ష్యార్థమనే విత్తనం నాటి, బ్రహ్మ అయ్యారు. నామం ఇచ్చి, ఆయన వెళ్ళిపోవటం లేదు. అసలైన గురువు మనని అహర్నిశలూ చూస్తూనే ఉంటారు.

'ఏమమ్మా! సాధన ఎలా చేస్తున్నావు? ఇంకా మమకారమనే తీపి పోలేదే' అని చిలుకులు వేస్తూ అనుక్షణం మన యోగం యొక్క

క్షేమం చూసే సాక్షాత్తు విష్ణు స్వరూపుడు గురుదేవుడు. కామక్రోధాదులు, అహంకార మమకారాలు, రాగద్వేషాలు, సుఖదుఃఖాలు అనే కలుపు మొక్కలను తీసేసుకోమంటారాయన.

తల్లికి ఎప్పుడూ బిడ్డ వయస్సు తెలియదట. అదే విధంగా గురుదేవులు కూడా తమ బిడ్డలెంత పెద్దవారైనా నోట్లో గోరుముద్దలు పెట్టి తినిపిస్తారు. భద్రంగా ఇనప్పెట్టెలో దాచుకునే కాగితాలు, పత్రాలు ఇవ్వరు వారు. సమర్థులైన గురుదేవులు మనస్సు మీదనే ముద్రవేస్తారు. ఇంకా ఏ మూలనైనా గుణాలుకాని, 'దేహం నేను' అనే భావన కాని ఉంటే, దానిని కూడా లయం చేసుకునే లయకారకుడైన శివ స్వరూపుడు గురువే. అటువంటి శిక్షణనిచ్చి తన బిడ్డలకి స్వస్వరూప జ్ఞానాన్ని ప్రసాదించే పరబ్రహ్మమే తానైన వారు గురుదేవులు.

గురులక్ష్యార్థాన్ని పొంది, గురుసాన్నిధ్యంలోనే ఉన్నా కూడా గుణాలూ, వాసనలూ వెన్నంటి ఉంటూనే ఉంటాయి. మనకి కోపం వచ్చినట్లు కూడా మనకు తెలియదు. ఏదో ఒక బలహీనతను కనిపెట్టి, అది బయటకి వస్తుంది. నిజమైన సాధకుడికి కోపమనేది మనస్సులో కూడా రాకూడదు.

ఈ జీవితం బుద్బుద ప్రాయమైనది. మహాత్ములు చెప్పినట్లుగా నడుచుకుంటే తప్పకుండా భగవంతుణ్ణి తెలుసుకోవచ్చు. చూడవచ్చు. భగవంతుణ్ణి చేరటానికి గృహస్థాశ్రమం బంధం కాదు.

సంసారంలో మనం ఉండవచ్చు. కాని మనలో సంసారం ఉండకూడదు. కర్మలో అకర్మను చూసే మార్గాన్ని గురుదేవులు చెబుతారు. ఏ పని చేస్తున్నా, మనలో నిరంతరం భగవన్నామం జరుగుతూ ఉంటే అప్పుడు మనం తామరాకుమీద నీటి బొట్టు లాగా ఈ సంసారంలోనే ఉన్నా, సంసారం మనకి అంటదు. అదే కర్మలో అకర్మ.

కనుక భగవన్నామం ఎంతో గొప్పది. మీరు ఆశ్రయించిన దేవుడే మీ సర్వస్వం అని నమ్మండి. మీలో భగవన్నామం మారుమ్రోగాలి. మీలో దాగి ఉన్న అనంత శక్తిని భగవన్నామం ద్వారా మేల్కొలపండి.

****

# సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి) - పరాశర ప్రసాద్

శ్రీబాబు మాట్లాడుతూ పరమాత్మ వస్తువు గోచరించనిది, అవ్యక్తమైనది, అనంతమైనది. మనకి గోచరించేది కూడా అనంతమైనదే. ఈ దేహాన్ని ప్రకాశింపచేసేది నిత్యమైన అనంతమైన పరమాత్మ వస్తువని ఎలా తెలిసికోగలిగావు? అని ప్రశ్నించారు. చందూ మాట్లాడుతూ గురు లక్ష్యార్థము నందు మనస్సు నిలిపితే తెలుస్తుంది బాబూ అని చెప్పారు. వెంటనే శ్రీబాబు 'అటువంటి ప్రయత్నం ఎప్పుడైనా చేశావా?' ప్రశ్నించారు. 'అలా చేయటానికి బహుశ సోమరితనం అడ్డు వచ్చి ఉంటుంది. నీలోని సోమరితనము, నీచగుణాలు హరించటానికి, ధ్యానం సరిగా కుదరటానికి కావలసిన శక్తి మీరే ఇవ్వాలి గురుదేవా అంటే నేను ఏం చేయగలను చెప్పు. ఇప్పుడు నన్ను ఈ ప్రశ్న అడిగావు. ఈ సందేహం కలగటానికి కారణం నీ మనస్సు గురులక్ష్యార్థము మీద నిలబడక పోవటమే. గురుదేవుడు నీకిచ్చిన శక్తిని గుర్తించకపోవటమే కాకుండా నీ ప్రయత్నలోపం పెట్టుకొని శక్తి ఇవ్వలేదని గురువుని అనటం ఏం న్యాయం? మీకు ఇచ్చిన అక్షరాలు దిద్దటం మానేసి ఉపాధ్యాయుడిని పుస్తకం చదవటం నేర్పమంటే ఎలా ఉంటుంది? అక్షరాలు దిద్దితే పుస్తకం చదవటం మీకే వస్తుంది. క్లాసులో ఉపాధ్యాయుడు ఇచ్చిన పాఠాన్ని చదవకుండా పాఠం రాలేదంటే ఎలా వస్తుంది? లౌకిక విద్యకే అంత ప్రాధాన్యత ఉంటే బ్రహ్మ విద్య విషయంలో ఎంత జాగ్రత్త అవసరమో ఆలోచించండి.

తేజో స్వరూపుడైన పరమాత్మ సాక్షాత్తు గురుదేవుడే. భక్తుల అజ్ఞానమనే చీకటిని హరించి కాంతిని ప్రసాదిస్తాడు. భక్తులు వక్రమార్గంలో నడచినట్లైతే ఆ కాంతిని పొందజాలరు. ఎన్నటికీ తెలిసికోలేరు. గురుపాదాన్ని పట్టుకొని గురుదేవుడు అఖండ స్వరూపుడు, త్రిమూర్తి స్వరూపుడు, సర్వవ్యాపకుడు అని తెలిసికొన్న భక్తునికి సందేహం కలుగుతుందా? అలా ప్రశ్న ఉద్భవించిందంటే అదే మాయాశక్తి. అది మీలోని బలహీనతని కనిపెట్టి

క్రిందపడవేస్తుంది. పైకి లేవనీయదు. కనీసం గురుదేవుడి చేయూతని కూడా అందకుండా జేస్తుంది జాగ్రత్త సుమా!' అని హెచ్చరించారు. 'ఎవరి సాధన వారే చేయాలి. నువ్వు అన్నం తిను, నా కడుపు నిండాలి అంటే ఎలా? చందూ! నిజమైన పండితుడు అంటే ఎవరమ్మా?' అని అడిగారు.

భగవద్గీతలో **యస్యసర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పండితం బుధాః** అని చెప్పారు. దాని అర్థం చెప్పమ్మా అని శ్రీబాబు అడిగారు. చందు అర్థం చెబుతూ జ్ఞానాగ్ని చేత కామ సంకల్పాలన్నిటినీ దగ్ధం చేసికొన్నవారే నిజమైన పండితులు అని చెప్పారు. శ్రీబాబు మాట్లాడుతూ తెలిసిందా నిజమైన పండితుడంటే ఎవరో? ఈ పుస్తకాలు చదివిన వాడు కాదు. కామసంకల్పాలను విసర్జించినవాడికి ఏ రకమైన సందేహాలు ఉండవు. ఎవరైతే ఇంద్రియాలను, విషయాదులను నమ్ముకుంటారో వారు అజ్ఞానాంధకారంలో ఉంటారు. వారు ఎన్నటికీ తరించరు. వారు కండ్లు ఉన్న అంధులు. కండ్లు లేనివాడు భగవంతుణ్ణి ఒకసారి కాకపోతే మరొకసారైనా దర్శించగలుగుతాడు. కాని కండ్లు ఉన్న అంధుడు ఎన్నటికీ భగవంతుడిని దర్శించలేడు అన్నారు.

శ్రీబాబు తారకంగారిని ప్రశ్నిస్తూ శ్రీమన్నారాయణ మూర్తికి గంధం ఎందుకు ప్రీతికరమైనదో చెప్పగలవా? అని అడిగి అది అందరికీ పరిమళాన్ని ఆనందాన్ని అందజేస్తుంది. అంతేకాదు తాను దహించుకుపోతున్నా మంచి సుగంధాన్ని అందజేస్తుంది. అది దాని యొక్క విశిష్టత అని చెప్పి నీకు ఈ ప్రశ్న ఎందుకు పుట్టిందో తెలిసికో. నీ ప్రశ్న ద్వారా అందరికీ సుగంధ పూరితమైన నా బోధని అందజేయగలిగావు కదా! అన్నారు శ్రీబాబు.

- సశేషం

## శ్రద్ధాంజలి

ఆశ్రమంలో స్థిరనివాసులైన, పరమ భక్తులైన శ్రీమతి ఎల్లాప్రగడ శేషమ్మగారు (భీమవరం తాతయ్యగారి పెద్ద కుమార్తె) 29-11-08 శనివారం రాత్రి 1గంటకు శ్రీసద్గురు సాయుజ్యం పొందారు. గత కొద్ది సంవత్సరాలుగా వీరు తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్నారు. వీరి వయస్సు 93సం॥లు. వీరి కుటుంబసభ్యులకు సద్గురుదేవులు శాంతిని ప్రసాదించెదరు గాక!

# శ్రీగీతా సూత్ర రత్నమాల

(గత సంచిక తరువాయి) -శ్రీ యోగేశ్వరానంద స్వామి

**36. భూతేభ్యా భూతాని యాంతి.**

గణదేవతల నుపాసించువారు ఆయా గణదేవతల లోకమునే బొందెదరు.

**37. జుహోషి కరోష్యశ్నాసి తపస్యసి దదాసి యత్తదర్పణమ్.**

కాని నీవు యజ్ఞ యాగ హోమాది క్రియలను, తదితర సర్వకర్మలను, తపస్సును, దానమును శ్రీకృష్ణార్పణ పూర్వకముగ నొనర్పుము.

**38. అనన్యభాగ్భజతే సమ్యక్ సాధురేవ దురాచారోzపి.**

ఒకప్పుడు దుర్మార్గుడైనవాడే అనన్య చిత్తముతో ఈశ్వర భజన మొనర్ప నారంభించిన అతనిని సత్పురుషునిగానే పరిగణింపనగును.

**39. స్త్రియో శూద్రాస్తదాశ్రిత్య పరాంయాంతి.**

వేదాధ్యయన రహితులగు స్త్రీ, శూద్రులు కూడా భగవద్భక్తి వలన తరించగలరు.

**40. జ్ఞాన సత్య శమ సుఖ క్షమాzహింసా మోహ దుఃఖాది సర్వం తదేవ భవతి.**

లోకమున జీవులకు తటస్థించు మంచి చెడ్డలన్నియును పూర్వకర్మ ఫలానుసారము ఈశ్వరుని వలననే ప్రసాదింప బడుచున్నది.

**41. నిత్య యుక్తానాం బుద్ధి యోగం తద్దదాతి.**

నిత్య నిరంతముగ ప్రీతితో, భగవద్భజన మొనర్చువారికి ఆయనే తత్ స్వరూప ప్రాప్తిని బొందించు జ్ఞానయోగమును ప్రసాదించును.

**42. తత్సత్పురుషం శాశ్వతం దివ్యమాదిదేవ మజమిత్యాహుస్సర్వే ఋషయః**

సద్రూపమును, పురుషశబ్ద వాచ్యమును అగు ఆత్మనే బ్రహ్మమునే, దివ్యుడనియు, ఆదిదేవుడనియు, అజుడనియు, ఋషులందరు కీర్తించుచున్నారు.

**43. ఆది మధ్యాంత రహితాత్మా.**

ఆయన అదిమధ్యాంత రహితుడు.

-సశేషం

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**జనవరి 2009**

**1 గురు ఆంగ్లసంవత్సరాది**, శ్రీ సద్గురుపాదపూజ, భక్తసమారాధన

**7బుధ ముక్కోటి ఏకాదశి,** ఉత్తర ద్వార దర్శనం,శ్రీ సద్గురుపాదపూజ, అర్ధఏకాహం, భక్త సమారాధన.

**11 ఆది పూర్ణిమ,** శ్రీ సద్గురుపాదపూజ

**13 మంగ భోగి**, శ్రీ సద్గురుపాదపూజ, భక్త సమారాధన, రాత్రి 8 గం.శ్రీ శ్రీసద్గురుదేవులకు భోగిపళ్ళు పోయుట.

**14 బుధ సంక్రాంతి**, శ్రీ సద్గురుపాదపూజ, భక్త సమారాధన

**20 మంగ శ్రీగురుదశమి**, శ్రీ సద్గురుపాదపూజ, సత్సంగం

**24 శని** శనిత్రయోదశి, మాసశివరాత్రి

**ఫిబ్రవరి 2009**

**2 సోమ రథసప్తమి.**

**5 గురు భీష్మఏకాదశి,** శ్రీసద్గురుపాదపూజ, సత్సంగ సమావేశము. పెదనింద్రకొలనులో శ్రీసద్గురుదేవుల దివ్యమంగళ మూర్తి ప్రతిష్ఠా పంచమ వార్షికోత్సవం, శ్రీసద్గురుపాదపూజ, సత్సంగసమావేశం, భక్త సమారాధన.

**7 శని** శనిత్రయోదశి

**9 సోమ వ్యాసపూర్ణిమ**, సత్సంగం, శ్రీసద్గురుపాదపూజ, భక్తసమారాధన.

**19 గురు శ్రీగురుదశమి**, సత్సంగం, శ్రీసద్గురుపాదపూజ.

**23 సోమ మహాశివరాత్రి**. తె॥జా 3గంటలకు బృందావనంలో శ్రీసద్గురు దేవులకు అభిషేకం, 5గం.లకు శ్రీసద్గురుపాదపూజ. ఉదయం 11గం.లకు శివాలయంలో సహస్రఘటాభిషేకం, లక్షబిల్వార్చన, భక్తసమారాధన. సాయంత్రం ఊరేగింపు. రాత్రి 8గం.లకు శ్రీమహాకాళీకాపరశ్వరీ రామలింగేశ్వర సాముహిక కళ్యాణ మహోత్సవం.

# సత్సంగ సౌరభం

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

పూజ్యశ్రీ జ్యోతిర్మయానంద భారతి మాతాజీవారు (శ్రీ పరబ్రహ్మ షణ్ముఖానందాశ్రమం, పాలకొల్లు) భాగ్యనగర శాఖలో చేసిన ఆధ్యాత్మిక ప్రసంగంలోని తృతీయభాగం ఈ నెల ప్రచురిస్తున్నాము. -ఎడిటర్

నేను నా చిన్నప్పుడు ఆశ్రమానికి వెళ్ళినప్పుడు గురుదేవులు ఇలా అన్నారు 'గురుకృపమీరరాదు. గడ్డపారమింగరాదు'. గడ్డపార ఎంత కఠినంగా ఉండి నేలను చదును చేస్తుందో, గురువాక్యం కూడా అంతపని చేస్తుంది.

**మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం**

పలికించే శక్తి ఇస్తే దానిని అడ్డదిడ్డంగా పలికితే మూగతనం వస్తుంది. నడిచే శక్తి ఇస్తే దానిని నడవరాని చోటికి తీసుకువెళ్తే నడిచే శక్తి నశిస్తుంది. '**వజ్రాదపి కఠోరాని మృదూని కుసుమానిచ**'. వాక్కు కఠినం అయినా వారి హృదయం కోమలం.

తొమ్మిది పదేళ్ళ వయస్సులో నేను ఆశ్రమానికి వెళ్ళాను. నాకు అక్కడ అందరూ కొత్త. ఆశ్రమం ఊరికి మూడు మైళ్ళు. మధ్యలో అడవి. నాకు ఏదో పని అప్పచెప్పారు. అది నాకు అర్థం కాలేదు. గురువుగారు ఏమైంది అని అడిగితే 'ఆ పని నేను చెయ్యలేదు. ఆ వస్తువు తేలేదు' అని చెప్పాను. 'అయితే వెళ్ళి తీసుకురా' అన్నారు. అప్పటికి సమయం రాత్రి 11గంటలు. దారిలో భయంకరమైన అడవి దాటాలి. గాఢాంధకారం. గేటు వద్దకు రాగానే ఒక తేజస్సు నాముందు, వెనుక పాదాల శబ్దం వినిపిస్తోంది. అప్పుడు అనుకొన్నాను. 'అపారమహిమా గురుమహిమా' అని. నాకు దారి చూపిస్తూ, నా వెనుక ఉండి నన్ను రక్షిస్తూ వచ్చే గురువును ఏమని వర్ణించగలను?

నీకు ముక్తి కరతలామలకం. కాని బంధంలో ఉన్నాననుకుంటున్నావు. పడుకోవటం, సంసారం చెయ్యటం, తినటం - ఇవి మానవునికి జంతువులకు సమానమే. మానవునిలో ఉన్న విజ్ఞానం పశువులకు లేదు. పశువులు 'యదృచ్ఛా లాభ సంతుష్టః' అన్నట్లు పశువులు తాము మేసే గడ్డి దూడలకు దాస్తాయి. మనమో! మళ్ళీ మళ్ళీ చెయ్యిచాస్తాం. సృష్టికర్త పక్షులను సృష్టి ఎందుకు చేశాడు?

జాముజాముకి అవి కూస్తాయి. 'ఓం అనేది ఒక్కటే సత్యం. దానిని గుర్తించు' అని సూచన ఇస్తాయి. కోడి కొక్కురో 'ఒక్కడే రో' అంటుంది. కాకి కహో అంటే ఎవరు? ఆ ఒక్కడే అని తెలుపుతుంది.

ఆనందం లోపల ఉందా? బయట ఉందా? లోపల నిబిడీకృతమై ఉంది. ఎవరైతే నిరంతరం లోపల ఉన్న ఆనందాన్ని అనుభవిస్తారో వారు ముక్తులే. ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ నిబోధత - సద్గురువును ఆశ్రయించి నిష్ఠ వీడక గమ్యం చేరేవరకు సాధన చేయాలి. తమో రహితమైన ప్రశాంతత కావాలంటే సద్గురువు ద్వారా పొందాలి. మంచి బంగారానికి ఉలిదెబ్బలు సుత్తి దెబ్బలు పడతాయి. అలాగే తన దగ్గరకు తీసికొనే ముందు టెస్ట్ పెడతాడు గురుదేవుడు. తండ్రిని మెప్పించాలంటే తండ్రి నడిచిన మార్గాన నడవాలి. అలాగే గురువును మెప్పించాలంటే గురువునడిచిన మార్గంలో నడవాలి. గురుతత్త్వం అర్థం చేసికోవాలంటే బ్రహ్మముహూర్తంలో చింతన చెయ్యాలి అన్నట్లుగా పక్షులు తమ కిలకిలారావాలతో మేల్కొల్పుతాయి.

మనం గొప్పా? పశువులు గొప్పా? విష్ణుమూర్తిని మోసేది గరుత్మంతుడు. అమ్మవారిని మోసేది సింహం. వినాయకుణ్ణి మోసేది ఎలుక. కుమారస్వామిని మోసేది నెమలి. దేవుళ్ళను మోసేది పశువులైతే మానవుడు సంసారాన్ని మోస్తున్నాడు. కాబట్టి పశుపక్షులే గొప్ప.

వైరాగ్యం రావాలంటే లోభమోహాలను విడిచి పెట్టాలి. భర్త సంసారం మీద వైరాగ్యం చెంది తపస్సు కోసం అడవులకు బయలుదేరాడు. 'నువ్వు లేనిదే నేను మాత్రం ఇక్కడ ఎందుకు' అని భార్య కూడా అతని వెంట బయల్దేరింది. దారిలో భర్తకు బంగారు నాణెం కనపడింది. దానిమీద భార్యకు ఎక్కడ మోహం కలుగుతుందో అని భర్త దానిని మట్టితో కప్పాడు. భార్య 'ఏమిటి వెదుకుతున్నావు?' అని అడిగింది. 'ఏమీ లేదు బంగారు నాణెం ఇక్కడ పడి ఉంటే దానిమీద మట్టి కప్పాను' అంటాడా భర్త. అయితే నీకు ఇంకా ఇది బంగారం, ఇది మట్టి అనే తేడా ఉంది. పద ఇంటికి వెళ్ళిపోదాం అంది భార్య.

ఆహార నిద్రా భయ మైథునాలలో పశువులు సంయమనం పాటిస్తాయి. మానవులు పాటించరు. మరి మానవుడు ఎలా గొప్ప?

**జ్ఞానం విశోషో అధికోనరః** తనలో ఉన్న జ్ఞానం వల్ల మానవుడు గొప్పవాడు. ఆ జ్ఞానం నీలో ఉంది అని చెప్పేవాడు దొరికేంతవరకు మానవుడు

నైతికంగా పెరగలేడు. ఏది తెలుసుకొన్న తర్వాత ఇంక తెలియబడేది లేదో అదే జ్ఞానం. అది తెలిపేవాడే గురువు.

అనంతమైనది విశ్వం. ఆ విశ్వానికి అధిపతి విశ్వనాధుడు అతడు నీలోనే ఉన్నాడు. ఆ విశ్వేశ్వరుణ్ణి చూడు అని హెచ్చరిక చేస్తాడు గురుదేవుడు. కాని అది నువ్వు తెలుసుకోలేక పోతున్నావు. ఒకనాడు ఒక గొల్లవాడు మేకలను మేపుతుండగా, నిండు గర్భిణిగా ఉన్న పులి పులిపిల్లను కని చనిపోతే ఆ గొల్లవాడు పులి పిల్లను సాకి మేకలతో పాటుగా పెంచాడు. అది మేకలాగా ఆకులు అలములు తింటోంది. మేమే అని అరుస్తోంది. ఒకరోజు వేరే పులి అక్కడికి వచ్చి ఈ పులి పిల్లను తనతోపాటు తీసుకొని వెళ్ళి చెరువులో చూపించి **త్వమేవాzహం**, నారూపం నీరూపం ఒకటే, నాలాగే నీవు పులివి, మేకవు కావు అని తెలియజేస్తుంది. అలాగే మనందరిలో అదే చైతన్యశక్తి ఉంది. **మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః** ఈ జీవలోకం నా అంశమే అని చెప్పాడు భగవానుడు. మనం దైవాంశలమే, ఇంకా మనం జీవులం అనుకుంటే ఎట్లా? భగవంతుడు బంగారం అయితే మనం ఆభరణాలం. ఆభరణాలను కాలిస్తే బంగారం అయిపోతాయి. మన సంకల్పాలను జ్ఞానాగ్నిలో వ్రేల్చితే నీలోని అజ్ఞానం తొలగిపోతుంది. కాబట్టి జ్ఞానాగ్నిని ప్రజ్వలింపచేసుకోవాలి. దానికి గురుదేవుల అనుగ్రహం కావాలి.

**జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః** అని భగవద్గీత వాక్యం. జ్ఞానమనే అగ్నిని ప్రజ్వలింపచేసికోవాలి. సద్గురువుల ద్వారా జ్ఞానాన్ని వికసింప చేసుకున్నాం. దానిని ఇంకా వికసింప చేసుకుంటే పునర్జన్మ అనేది ఉండదు. అప్పుడు **తస్యైవాzహం, త్వయైవాzహం, త్వమేవాzహం** అనే గురుతత్త్వంలో ఓలలాడతాం.

ఒకాయన పట్నం వచ్చాడు. కుక్కలు వెంటపడితే బెదిరి చెత్త కుప్పలో పడ్డాడు. ఒక చిన్న అద్దంముక్కలో తన ముఖం కనిపించింది. ఇంతలో వాళ్ళ అబ్బాయి అక్కడకు వచ్చాడు. ఆ అద్దం పెంకులో వాళ్ళ నాన్నను చూశాడు. 'ఇక్కడ ఉన్నాడు' అని ఆ అద్దం ముక్కను ఇంటికి తీసుకు వెళ్ళాడు. ఆ అద్దంలో తన భార్య ముఖం కనిపించింది. ఆమె తన సంసారం గురించి అద్దానికి చెబుతోంది అని అనుమాన పడ్డాడు. ఆ అద్దంలో ఆమె ముఖం కనిపించింది. మా ఆయన పట్నం నుండి ఎవత్తెనో తెచ్చాడు అనుకొంది. ఒక ముసలామె ఆ అద్దంలో తన ముఖం చూసి తెస్తే తెచ్చాడు ముసలామెనెందుకు

తెచ్చాడో? అనుకొంది. సంగతేమిటంటే వాళ్ళు ఎప్పుడూ అద్దంలో ముఖాలు చూసుకోలేదు. వారెలా ఉంటారో వారికి తెలియదు. అప్పుడు పంచాయితీ అయింది. కాని ఆ పంచాయితి పెద్దకు తెలుసు. 'ఒరేయ్! ఇది అద్దం. ఇది చైతన్య తత్త్వం. దానివైపు ఎవరు తిరుగుతారో ఆ రూపం అవుతుంది. **తస్యైవాహం, త్వమేవాహం.** అలాగే భగవంతుడివైపు తిరిగితే భగవత్స్వరూపులౌతారు' అని చెప్పాడు. కులపెద్ద ద్వారా వాళ్ళు తెలుసుకొన్నట్లు 'గురువుద్వారా మన నిజతత్త్వం మనకి తెలుస్తుంది. అప్పుడు అరెరే! ఇందులో ఇంత ఆనందం ఉంది అని ఇంతవరకు తెలియలేదే అనిపిస్తుంది. ఇంతకు ముందు చెప్పుకొన్నట్లు ఆ పులిపిల్ల ' నేను పులినే' అన్న నిజతత్త్వం వేరొక పులి ద్వారా ఎలా తెలిసికున్నదో అలాగే మన నిజతత్త్వాన్ని మనం గురువుద్వారా తెలుసుకోవాలి.

**షడంగాది వేదో ముఖే శాస్త్ర విద్యా కవిత్వాది గద్యం సువద్యం కరోతి**
**గురోరంఘ్రి పద్మే మనశ్చే న లగ్నం తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిం**

'ఎన్ని వేద శాస్త్రాలు చదివినా, కవియైనా గురుపాదములయందు మనస్సు లగ్నంకాకపోతే జీవితం వృథా' అన్నారు శ్రీ శంకరభగవత్పాదులవారు.

గురుపాద చింతన ఎప్పుడు చేద్దాం? మనవళ్ళు పుట్టిన తరువాతా? మన జీవితం ఎప్పటి వరకో గ్యారంటీ ఏమైనా ఉందా? అసలు నీకు 'గ్యారంటీ కార్డ్' ఉందా? అందుకే కృష్ణస్వామి '**తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ**' అన్నారు. సర్వ కాలములలో గురుపాద చింతన చేయాలి.

**నైవ కించిత్ కరోమితి యుక్తో మన్యేత తత్త్వవిత్।**
**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥**
**ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్నపి।**
**ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్॥**

తత్త్వజ్ఞుడైన యోగి, చూచుచు, వినుచు, స్పృశించుచు, ఆఘ్రాణించుచు, భజించుచు, నడచుచు, శ్వాసక్రియను చేయుచు, భాషించుచు, త్యజించుచు, గ్రహించుచు, కనులను మూయుచు తెరచుచు ఉన్నను తన ఇంద్రియములు తమ తమ విషయములందు వర్తించుచున్నవనియు, తానేమీ చేయుటలేదు అని భావించును. కాబట్టి చూస్తున్నప్పుడు విశ్వనాధుడిని చూడండి. వినేటప్పుడు దేవుని గురించి వినండి.

మన ఆయువు ఎంతవరకో మనకి తెలియదు. ఒకామెకు లేక లేక కొడుకు పుట్టాడు. జ్యోతిష్కుడు చూసి విద్యారేఖ బ్రహ్మాండంగా ఉంది అంటాడు. ఆమె ఆనంద పడుతుంది. కాని ఆయుష్యరేఖ- ఈబిడ్డ ఆరు మాసాల కన్నా ఎక్కువ బ్రతకడు అంటాడు. అప్పుడు దుఃఖం వస్తుంది. ఈ విశ్వంలో మనం అందరం యాక్టర్లం మాత్రమే. మనల్ని ఆడించే రిమోట్ కంట్రోల్ ఆయన దగ్గర ఉంది. మనం సన్మార్గంలోకి రావాలంటే భగవంతుని గుణాలను అలవరచుకోవాలి.

**అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ।**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖక్షమీ॥**
**సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢ నిశ్చయః।**
**మయ్యర్పిత మనోబుద్ధిః యోమద్భక్త స్సమేప్రియః॥**

ఏ ప్రాణియందును ద్వేషభావము లేనివాడును, సర్వప్రాణులందు అవ్యాజమైన ప్రేమ, కరుణకలవాడును, మమతాహంకారములు లేనివాడును సుఖదుఃఖములందు సమభావము కలవాడును, క్షమాగుణము కలవాడును, సర్వకాలసర్వావస్థలయందు సంతుష్టుడై ఉండుయోగియు, శరీరేంద్రియ మనస్సులను వశమునందుంచుకొనినవాడును, నాయందు దృఢమైన నిశ్చయము కలవాడును అయి, నాయందే మనోబుద్ధులను అర్పణ చేసిన నా భక్తుడు నాకు ప్రియుడు.

సంత్ వినోబా శిష్యులతో కాశీకి వెళ్ళి కావిడిలో గంగ మోసికొని వస్తుంటే, భయంకరమైన అడవిలో, మండుటెండలో, ఒక గాడిద దాహంతో తన్నుకుంటుంటే "వీడు పలికే శివుడు వీడికి అభిషేకం చేద్దాం" అంటూ ఆ గాడిదమీద నీరు పోశారు. ఆ గాడిద రూపం మాయమై అక్కడ శివరూపం ప్రత్యక్షమైంది.

అన్ని జీవరాసులను ప్రేమించు. అన్ని ప్రాణులలో నేనే ఉన్నాను అంటున్నాడు భగవంతుడు.

రామకృష్ణ పరమహంసకు శిష్యులలో ఇద్దరు ముఖ్యులు. ఒకరు స్వామి వివేకానంద, రెండవ శిష్యుడు నాగమహాశయుడు. వీరిరువురిలో మాయను ఎవరు జయిస్తారు? స్వామి వివేకానంద జ్ఞానాన్ని నలుదిశల ప్రకాశింపచేశాడు. నాగమహాశయుడు చేలలోకి వెళ్ళి జీవసేవ చేశాడు. వివేకానంద ఎదిగి బయటకు వచ్చాడు. నాగమహాశయుడు సూక్ష్మమై బయటకు వచ్చాడు. ఇద్దరి దృష్టి ఒక్కటే.

ఒకచోట ఒక మహాత్ముడు సత్సంగం చేస్తుంటే, ఒకడు కొన్నాళ్ళు వెళ్ళాడు. ఆ తరువాత సత్సంగానికి రావటం మానేశాడు. ఆ మహాత్ముడు అతన్ని పిలిచి అడిగితే 'స్వామి నాకు పెళ్ళైంది'. అన్నాడు.

గురువు- 'అయితే?'

శిష్యుడు- మీకు పెళ్ళైతే తెలిసేది. నా తల్లితండ్రులకు నా భార్యకు నేనంటే ఇష్టం.

గురువు- అలాగా అయితే పరీక్షిద్దాం (అని అతడికి ఒక మూలిక ఇచ్చి) 'ఇది నీవు తీసుకుంటే ఇతరులకు నీవు చచ్చినట్లు కనిపిస్తావు. కాని నీకు వాళ్ళు చెప్పేది అంతా వినిపిస్తుంది.'

ఆ శిష్యుడు ఇంటికి వెళ్ళి ఆ మూలిక సేవించాడు. అతడు మరణించాడు అనుకొని ఆ ఇంట్లో వారందరూ ఏడుస్తున్నారు. గురువుగారు వచ్చారు. ఒక గ్లాసునీళ్ళు తీసుకుని మంత్రించి 'ఈ నీరు ఎవరు త్రాగితే వారు మరణించి ఇతడు బ్రతుకుతాడు' అంటాడు. ఎవరికి వారు ఏదోసాకు చెప్పి తప్పించుకొంటారు. చివరికి అతని భార్య 'మీకు పెళ్ళికాలేదు, మీరు పుచ్చుకోండి' అంటుంది గురువుగారిని. ఇదంతా గమనించిన శిష్యుడు లేచి ఇక నా శేషజీవితం నారాయణుణ్ణి తెలుసుకోవటం కోసం వినియోగిస్తాను అని గురువుగారితో వెళ్ళిపోయాడు.

-సశేషం

ముళ్ళ పొదను ఒకడు గట్టిగా కౌగలించుకుని హత్తుకున్నాడు. ముళ్ళు గుచ్చుకుంటుంటే పొదనింకా గాఢంగా అదుముకుని గట్టిగా ఏడుస్తూ దారిని పోతూన్న వ్యక్తిని సాయం చేయమని అరవసాగాడు. 'నువ్వు గట్టిగా కౌగలించుకున్న పొదను ముందు వదలిపెట్ట'మని బాటసారి చెప్పినా అతను వదలలేదు. సాయంకాలం వరకూ అలా రోదిస్తూనే ఉన్నాడు. తనకు తాను సాయం చేసుకుంటే తప్ప ఆ పరిస్థితుల నుంచి ఎవరూ అతన్ని కాపాడలేరు. ఎవరి బంధాలను వారే తెంచుకోవాలి. అది యితరుల చేతుల్లో లేదు.

-స్వామి రామదాసు

# మౌనధ్యాన సప్తాహశిబిరం

-రమణ ప్రసాద్

నీ దృష్టి వేటిమీద ఉంటే అవే ప్రత్యక్షమవుతాయి. మరి అలా ఉంటే ఎలా తరించగలుగుతాం? ఒకటి అనుకొని ఇంకొకటి చేస్తే గమ్యం ఎలా చేరతాం? నువ్వు హైదరాబాద్ వెళ్ళాలనుకొని వైజాగ్ వెళ్ళే ట్రైన్ ఎక్కితే ఎలా హైదరాబాద్ చేరతావు? నీ నిజమైనస్థానం నీలోనే ఉన్నది. త్యాగరాజస్వామి మనస్సును నిలదీసి అడిగాడు.

**'నిధిచాల సుఖమా రాముని సన్నిధి సేవ సుఖమా**
**నిజముగ బల్కుమనసా'**

అని ప్రపంచ వ్యవహారాల నుండి మనస్సు విముఖమైనప్పుడు నువ్వు రాముని సన్నిధిలో ఉంటావు. వ్యక్తిత్వభేదాలు పోనంతవరకు వ్యవహారం తిష్ఠవేసుకొని కూర్చుంటుంది. ఒకవ్యవహారం తర్వాత ఇంకొక వ్యవహారం....ఇలా ఎడతెరిపి లేకుండా వస్తాయి. వ్యావహారిక దృష్టినుండి పారమార్థిక దృష్టికి రావాలి. అప్పుడు నీ మనస్సు నీ చెప్పు చేతలలో ఉంటుంది. అప్పుడు నీ స్వరూపానికి అరూపం జరుగుతుంది.

మీరు ఎవరికివారు ప్రశ్నించుకోండి? మనందేనికి విలువ ఇస్తున్నాం? వ్యవహారానికా? పరమార్థానికా? మనం నిజమైన 'హరి'దాసులం కావాలి

**మై హరిచరణన్ కీ దాసీ**
**మలిన విషయ రన్ జాకే జగ్‌కో రామ్‌నామ్ రన్ ప్యాసీ**
**జనమ జనమ కీ దాసీ - మై హరి చరణన్ కీ దాసీ**- అని మీరా తల్లి పాడుకుంది. ప్రపంచ విషయాల నుండి మనస్సును భగవంతుని వైపు తిప్పి రామనామ రసాన్ని పొందటానికి ఎంత ఆవేదన చెందుతోంది? 'నేను నీకు భిన్నంగా లేను' అంటాడు భగవంతుడు. ఏకత్వమే ప్రకాశిస్తుంది. అది విచారణ ద్వారా, నిత్యం చేసికొనే అనుష్ఠానం ద్వారా తెలుసుకోవాలి. మనస్సు సంసారం నుండి విడివడితే మోక్షమే. దానినే 'వడ్లగిండలో బియ్యపుగింజ' అని సూక్ష్మంగా తెలిపారు విజ్ఞులు.

మన సహస్రారంలో ప్రకాశించేవి శ్రీ సద్గురు దేవుల దివ్య చరణారవిందములే. రామనామ రసం మనం పొందుతున్నామా లేదా అని బేరీజు వేసుకోవాలి. ఆస్తి పాస్తులు చూసుకోవటానికే జీవితం సరిపోతోంది.

నిజమైన ధనం ఏది? నామధనం. మన ఇల్లు అద్దెకొంప. మన నిజ స్థితిని తెలుసుకోవటానికే ధ్యానం చేస్తున్నాం. ఆత్మవిచారణ చేసి స్వస్వరూపస్థితిని తెలుసుకోవటాకే ధ్యానం చేస్తున్నాం. ఈ దేహంలో ఉన్న దేహికి ఆయుః పరిమాణం లేదు. అది అంతటా నిండి ఉంది. దానికి సరిహద్దులులేవు. అది మన సొంత ఇల్లు. ఈ కొంప అద్దెకొంప. నీ సొంత ఇంటికి నాధుడు గురుదేవుడు. మన ఇంటికి మనం చేరుకోవటానికే మనం ధ్యానం చేస్తున్నాం. దానికి ఫలానా సమయం అని లేదు, కాని ముందుగా ధ్యానం అలవడేవరకు నియమిత కాలంలో ధ్యానం చెయ్యాలి. మనస్సు ధ్యానంలో కూర్చోనివ్వదు. పడగొడ్తుంది. కుర్చీ దొరికితే కూర్చోవాలి అనిపిస్తుంది. అద్దె సరిగ్గా కట్టకపోతే (సాధన సరిగ్గా చేయకపోతే) ఇంకొక ఇల్లు చూసుకొంటాను అంటుంది. అంటే **పునరపి జననం పునరపి మరణం.**

కాని ఎప్పుడూ భగవన్నామ స్మరణలో ఉంటే ఎన్ని జన్మలు వచ్చినా ఫరవాలేదు. 'జనమ్ జనమ్ కాదాసి' అంటుంది మీరా తల్లి.

కులశేఖరమహారాజు -

**నాస్థా ధర్మే నవసునిచయే నైవకామోపభోగే**
**యద్యద్భవ్యం భవతు భగవన్! పూర్వ కర్మాను రూపం**
**ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేపి**
**త్వత్పాదాంభోరుహ యుగగతా నిశ్చలా భక్తిరస్తు**

అని కృష్ణ ప్రభువును ప్రార్థించాడు.

'ఓ కృష్ణా! ధర్మము ఆర్జించాలనిగాని ధనం కూడబెట్టాలనిగాని, కామములను అనుభవింపవలెననిగాని నాకు కోరికలేదు. నా పూర్వ కర్మములననుసరించి ఏవి ఎట్లు జరుగవలెనో అట్లు జరుగుగాక! ఈ జన్మమందుగాని, జన్మాంతరమునందుగాని నీ పాదారవిందముల మీద నాకు నిశ్చలభక్తి కలుగ వలెననునదియే నా అభిమతము!

ఈ జీవితం ఉన్నంతవరకు మాధుర్యాన్ని పొందుదాం. శ్రీ సద్గురు పదారవిందములు సాధుహృదయ సంస్పందములు-హృదయం పవిత్రంకావాలి. తామాశ్రయించిన ప్రభువు దివ్య చరణారవిందములయందు భక్తి ఎవరికి ఉంటుందో వారికే చిక్కుతాయి ఆ పాదాలు.

ఎవ్వరికీ చిక్కని గోపబాలుడు గోపికలకు చిక్కాడు. వారి అనన్య భక్తి చేత యశోదకు చిక్కినట్లుగా చిక్కాడు.

మనకీ చిక్కారు మన హృదయబాబు. అందరూ ఆ నమ్మకంతో ఆరూఢంగా ఆ పదాలను ఎక్కడ ధ్యానిస్తే అక్కడ ప్రకాశిస్తాయి. కళ్ళలో ప్రకాశిస్తాయి. సహస్రారంలో నిలుస్తాయి.

ఆ దివ్య చరణారవిందముల సర్వవ్యాపకత్వంలో అంటుకొని ఉన్నాం. భగవంతునికి పుట్టుమచ్చలా అంటుకుపోవాలి. బల్లిలా అతుక్కోవటంకాదు. మనస్సును సాధన ద్వారా మచ్చిక చేసికోవాలి. అటువంటి శక్తిని, భక్తిని అనంత సర్వవ్యాపకత్వంలోని మాధుర్యాన్ని పొందెదురుగాక. అట్టి సమాధిస్థితిని పొందెదురుగాక అని గురుదేవులను ప్రార్థిస్తున్నాను. *

## శుభవార్త!




సమర్థ సద్గురు పాఠకులకు, భక్త మహాశయులకు శుభవార్త! శ్రీ విజయేశ్వరానంద ప్రసాద్ విరచితమైన శ్రీసమర్థ సద్గురు నాథుని దివ్య చరిత్ర -1 ఈ నెల (జనవరి 2009) నుండి ధారావాహికంగా ప్రచురింప బడుతున్నది. చందాదారులు అందరూ సకాలములో రెన్యూ చేయించుకొనండి. ఆసక్తికల భక్త మహాశయులందరూ మీ కాపీని రిజర్వ్ చేసుకోవలసినదిగా ప్రార్థిస్తున్నాము.

## శ్రీశ్రీశ్రీ సద్గురు గీతా యజ్ఞము, సాధుధర్మ సమ్మేళనము
## ( 9.12.08 నుండి 11.12.08 వరకు )

సమర్థ సద్గురు శ్రీశ్రీశ్రీ హనుమత్‌కాళీ వర ప్రసాదబాబూజీ మహరాజ్ వారి పరమ అనుగ్రహంతో గుండుగొలను గ్రామంలో (ప.గోజిల్లా)యోగిని శ్రీ చంద్రకాళీ ప్రసాద మాతాజీ వారి అధ్యక్షతలో శ్రీశ్రీశ్రీ సద్గురు గీతా యజ్ఞము 9.12.08 నుండి 11.12.08 వరకు, ది.12.12.08న శ్రీ సద్గురుదేవుల పాదపూజ ఎంతో వైభవంగా జరిగాయి. గీతా యజ్ఞంలో, సత్సంగ సమావేశములలో అసంఖ్యాకమైన భక్తులు పాల్గొన్నారు. అందరికీ తీర్థ ప్రసాదములు, మహానైవేద్య వితరణ(అన్నదానము) జరిగాయి.

**8.12.08 సోమవారం** రాత్రి గం॥ 7.02 నిలకు శ్రీశ్రీశ్రీ సద్గురు సత్సంగ గీతాయజ్ఞంలోభాగంగా త్రయాహ్నిక దీక్షా సంకల్పము, గోపూజ, విఘ్నేశ్వర పూజ, పుణ్యాహవాచనము, యాగశాల ప్రవేశము, అంకురారోపణ, వేదస్వస్తి జరిగాయి. ఈ యాగ కార్యక్రమును బహుయాగ నిర్వహణానుభవజ్ఞులైన బ్రహ్మశ్రీ కొండూరు రామసుబ్రహ్మణ్య ప్రసాద్‌గారి బ్రహ్మత్వంలో జరిగింది.



**9.12.08 మంగళవారం** ఏకాదశి, గీతా జయంతి. ఉదయం 5 గంటలకు గోపూజ, గణపతిపూజ, యాగదీక్షా స్వీకారము, అఖండజ్యోతి ప్రజ్వలనము జరిగాయి. ఉదయం గం.6.30నిలకు సర్వాధిష్ఠాన చైతన్య సమర్థ సద్గురు శ్రీశ్రీశ్రీ హనుమత్‌కాళీ వర ప్రసాద బాబూజీ మహరాజ్ వారి నగర పర్యటనోత్సవం అత్యంత వైభవంగా జరిగింది. ఈ ఉత్సవంలో అసంఖ్యాకమైన భక్తులు పాల్గొన్నారు.



ఉదయం 9 గంటలకు యజ్ఞ ప్రధాన మండపారాధన, అగ్నిర్మథనము,వేద పారాయణ, సూర్యనమస్కారములు ప్రధాన మండప పూజ,శ్రీభగవద్గీతా హోమము, శ్రీ గురుగీతా హోమము, అనంతరము తీర్థ స్రాదములు, మహాప్రసాద వితరణ జరిగాయి. సాయంకాలము 6 గంటలకు సత్సంగ సమావేశంలో పూజ్య శ్రీ మాతాజీ మరియుశ్రీశ్రీశ్రీ దండి నిర్మలానందగిరి స్వాములవారు, అష్టలక్ష్మి

పీఠము. తెనాలి, శ్రీశ్రీశ్రీ జ్యోతిర్మయానంద భారతీ మాతాజీవారు, శ్రీ పరబ్రహ్మ షణ్ముఖానందాశ్రమం, పాలకొల్లు అనుగ్రహభాషణం చేశారు.




రాత్రి 8 గంటలకు సహస్ర లింగార్చన, మంగళహారతి, మహామంత్రపుష్పము, దర్బారు, తీర్థ ప్రసాదములు, మహాప్రసాద వితరణ జరిగాయి.

**10.12.2008 బుధవారం** ఉదయం గం॥ 6.30 నుండిగం. 8.30 వరకు గోపూజ, యాగము, హనుమద్వ్రతము ఉదయం గం॥ 9 నుండి గం॥ 12 వరకు సత్సంగ సమావేశము జరిగాయి. ఈ సమావేశంలో భక్త సోదరులు శ్రీవిజయేశ్వరానంద ప్రసాద్ గారు, శ్రీశ్రీశ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామివారు, శ్రీపురక్షేత్రం, ఈదరబళ్ళాపురం, శ్రీశ్రీశ్రీ దండి నిర్మలానందగిరి స్వాములవారు, అష్టలక్ష్మి పీఠం, తెనాలి, శ్రీశ్రీశ్రీ మాతా జ్యోతిర్మయానంద భారతివారు, పరబ్రహ్మ షణ్ముఖానందాశ్రమం, పాలకొల్లు, యోగిని శ్రీ చంద్రకాళీప్రసాదమాతాజీ వారు అనుగ్రహభాషణం చేశారు. మధ్యాహ్నం 12 గంటలనుండి తీర్థ ప్రాదములు, మహా ప్రసాద వితరణ మధ్యాహ్నం 2.30 గం॥ లనుండి 4.30 గం॥ లవరకు ప్రధాన దేవతాహోమం సాయంత్రం 6 గం॥నుండి 8 గం॥ వరకు సత్సంగ సమావేశం. ఈ సమావేశంలో భక్త సోదరులు శ్రీవెంకటరమణ ప్రసాద్ గారు, శ్రీశ్రీశ్రీ మాతా జ్యోతిర్మయానంద భారతివారు,శ్రీ పరబ్రహ్మ షణ్ముఖానందాశ్రమం,పాలకొల్లు, శ్రీశ్రీశ్రీ దండి నిర్మలానందగిరి స్వాములవారు, అష్టలక్ష్మి పీఠం, తెనాలి,శ్రీశ్రీశ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామివారు, శ్రీపురక్షేత్రం, ఈదరబళ్ళాపురం, యోగిని శ్రీ చంద్రకాళీప్రసాదమాతాజీ వారు అనుగ్రహభాషణం చేశారు. రాత్రి 8 గం॥15 ని॥లకు మంగళహారతి, మహామంత్ర పుష్పం,దర్బారు, తీర్థ ప్రసాదములు, మహాప్రసాద వితరణ.

**11.12.08 గురువారం** ఉదయం 7 గంటలకు జరిగిన సామూహిక తులసి పూజలలో 200 మందికి పైగా భక్తులు పాల్గొన్నారు. ఉదయం 9 గం॥లనుండి 12 గం॥ ల వరకు సత్సంగ సమావేశం. ఈ సమావేశంలో భక్త సోదరి శ్రీసుషుమ్న ప్రసాద గారు, భక్త సోదరులుశ్రీతారక పరబ్రహ్మ ప్రసాద్గారు, శ్రీశ్రీశ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామివారు, శ్రీపురక్షేత్రం, ఈదరబళ్ళాపురం, యోగిని శ్రీ

 


చంద్రకాళీప్రసాదమాతాజీ వారు అనుగ్రహభాషణం చేశారు. సాయంత్రం 4.30 గం॥లకు పూర్ణాహుతి, ఋత్విగ్స్నాానము, వేదాశీర్వాదము. సాయంత్రం 6 గం॥లనుండి 8 గం॥లవరకు సత్సంగ సమావేశం. ఈ సమావేశంలో శ్రీశ్రీశ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామివారు, శ్రీపురక్షేత్రం, ఈదరబళ్ళాపురం,యోగిని శ్రీ చంద్రకాళీప్రసాద మాతాజీ వారు అనుగ్రహభాషణం చేశారు.

**12.12.08 గురువారం** ఉదయం 8గం॥లనుండి 11 గం॥ల వరకు సత్సంగ సమావేశం. ఈ సమావేశంలో భక్త సోదరి శ్రీజపమాల ప్రసాద గారు, శ్రీశ్రీశ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామివారు, శ్రీపురక్షేత్రం, ఈదరబళ్ళాపురం, యోగిని శ్రీ చంద్రకాళీప్రసాదమాతాజీ వారు అనుగ్రహభాషణం చేశారు. ఉదయం శ్రీ సద్గురుదేవుల పాదపూజ. అనంతరం శ్రీమాతాజీ గురుసోదరులను, సోదరీ మణులను దుశ్శాలువాలు కప్పి, సత్కరించి హారతి ఇచ్చారు. సాయంత్రం 6గం॥లనుండి 8 గం॥లవరకు సత్సంగ సమావేశం. ఈ సమావేశంలో భక్త సోదరులు శ్రీవెంకటరమణ ప్రసాద్ గారు, శ్రీశ్రీశ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామివారు, శ్రీపురక్షేత్రం, ఈదర బళ్ళాపురం, యోగిని శ్రీ చంద్రకాళీప్రసాద మాతాజీ వారు అనుగ్రహభాషణం చేశారు.




శ్రీ మాతాజీ భక్తుల కోరికపై సత్సంగ సమావేశాలను 15.12.08 వరకు పొడిగించారు. ఈ సత్సంగ సమావేశాలలో శ్రీశ్రీశ్రీ రామకోటి కృష్ణానంద స్వామివారు, శ్రీపురక్షేత్రం, ఈదరబళ్ళాపురం, భక్త సోదరులు శ్రీ విజయేశ్వరానంద ప్రసాద్గారు, శ్రీ పరాశర ప్రసాద్ గారు, శ్రీ వెంకటరమణ ప్రసాద్ గారు, శ్రీ కుమారస్వామి రాజా గారు, కొండ రామరాజుగారు, యోగిని శ్రీ చంద్రకాళీ ప్రసాద మాతాజీవారు ప్రసంగించారు.

**15.12.08 ఉదయం** శ్రీమాతాజీవారు శ్రీద్వారకాతిరుమల శ్రీ వెంకటేశ్వర స్వామిని దర్శించారు. ఆ దేవాలయ సి.ఇ.ఓ శ్రీ రామకృష్ణ గారు శ్రీ మాతాజీ వారికి శ్రీ వేంకటేశ్వరస్వామివారి జ్ఞాపికను శ్రీ స్వామివారి శేష వస్త్రమును బహూకరించారు.



## శ్రీ చింతలపాటి సీతారామచంద్ర వర ప్రసాద మూర్తిరాజు (మాజీ మంత్రి వర్యులు) గారి 90వ జన్మదినోత్సవ వేడుకలు

ది 16.12.08న శ్రీ సద్గురు దేవుల భక్తులైన శ్రీ చింతలపాటి సీతారామచంద్ర వర ప్రసాద మూర్తిరాజుగారి జన్మదినోత్సవం సందర్భంగా ఆ దంపతులను పూజ్య యోగిని శ్రీ చంద్రకాళీ ప్రసాద మాతాజీ నూతన వస్త్రాలతో అలంకరించి సత్కరించారు. ఈ సందర్భంలో శ్రీ మాతాజీవారు తమ ప్రసంగంలో శ్రీ మూర్తిరాజు గారి దేశభక్తిని, వారు చేపట్టిన సంక్షేమ సేవా కార్యక్రమములను కొనియాడారు. శ్రీ మాతాజీవారు ఇంకా మాట్లాడుతూ "శ్రీ మూర్తి రాజు శ్రీ బాబూజీ మహరాజ్ వారి భక్తులు. శ్రీబాబూజీ మహరాజ్ వారికి శ్రీ మూర్తిరాజు గారంటే ఎంతో ఇష్టం. ఎందుకంటే శ్రీ మూర్తిరాజుగారు గారు ధర్మ స్వరూపులు, వారికి ఉన్న భూమినంతనీ ప్రజల సంక్షేమంకోసం వినియోగించారు. St. Theresa Woman's college ని స్థాపించారు. ఇంకా 68 విద్యాలయాలను స్థాపించారు. ఏ ఆధారంలేని బాల బాలికలకు ఆశ్రయం కల్పించి వారిని విద్యావంతులుగా చేశారు, చేస్తున్నారు. శ్రీ సద్గురుదేవుల కృపవల్ల వీరు శత (నూరవ) జన్మదినోత్సవం జరుపుకోవటమే కాక ముందు వారు అనేక సంక్షేమ కార్యాలను చేపట్టి ప్రజాసేవా నిరతులై ఉందురు గాక! సద్గురుదేవులు వారికి అట్టి శక్తి సామర్థ్యములను ప్రసాదించెదరు గాక! శ్రీ సద్గురుదేవుల ఆశీస్సులు ఈ దంపతులపై సదా వర్షించుగాక!"అని ఆశీర్వదించారు.



# బంగారు పిచ్చుక

(గతసంచిక తరువాయి) -పరాశర ప్రసాద్

గురుదేవుల లీలలు విచిత్రంగా ఉంటాయి. ఇంతవరకు భర్తగా నా విధులు నేను నిర్వర్తించాను. కాని నాకు హార్ట్‌ఎటాక్ వచ్చినప్పుడు ఆవిడ నాకు చేసిన సేవని మరిపింపచేసే సేవను చేయవలసి వస్తోంది. బహుశ గురుబిడ్డగా జన్మరాహిత్యం పొందటానికి నన్ను ఋణవిముక్తుణ్ణి చేయటానికే గురుదేవులు నా కిలాంటి అవకాశాన్ని ప్రసాదించారు అని అనుకొనేవాణ్ణి. కాని ఆవిడమాత్రం నా గురించి ఎంతో బాధ పడేది. రాత్రి నేను నిదురించే సమయంలో ఆవిడ ఎవరితోనో సంభాషణ చేసేది. నేను మెలకువ తెచ్చుకుని 'ఎవరితో మాట్లాడుతున్నావు? ఏమైనా కలగన్నావా?' అని అంటే ' కలకాదు నిజమే. నేను నా కృష్ణుడితో పోట్లాడుతున్నాను. నన్ను ఇలా అనారోగ్యంతో మంచాన పడేసి, ఇతరులతో సేవ చేయించుకునేటట్లు ఎందుకు చేస్తున్నావు? నా పని నేను చేసుకునేటట్లు ఆరోగ్యాన్ని ప్రసాదించు. లేకపోతే నన్ను సుమంగళిగా నీలో చేర్చుకోవయ్యా' అని ప్రార్థిస్తున్నాను అనేది. ' నేను సుమంగళిగా నిష్క్రమించాలి. కాని నేను లేకుండా నా భర్త ఉండలేరు. దిగులుపడతాడు. కాబట్టి ఇద్దరినీ ఒకసారే తీసుకుపోవయ్యా కృష్ణయ్యా!' అని ప్రార్థిస్తున్నాను అన్నది.

రాజకుమారికి తను గురుసాయుజ్యం పొందే సమయం ఆసన్నమైంది అని తెలుసు. కాని ఆ విషయాన్ని తాను ఎప్పుడూ ఎవరికీ తెలియనీయ లేదు. నాకు తెలియకుండా నా కోసం ఒక గడియారం కొని నాకు అందజేసి ఇది మీరు నన్ను మరచిపోకుండా గుర్తుకు తెస్తుంది అని అన్నది. హైదరాబాద్ ప్రయాణానికి నన్ను ఎంతో బలవంతం చేసి, హైదరాబాద్ వెళ్ళిన తరువాత హైదరాబాద్‌లో ఉన్న బంధువులందరికీ ఫోన్‌లు చేసి పిలిపించుకుని, మాట్లాడింది. కొంతమందిని కలవలేకపోయానని కంట తడిపెట్టింది. 'ఎందుకమ్మా బాధపడతావు ఇంకో పర్యాయం వచ్చినప్పుడు వాళ్ళు కలుస్తారులే' అని నేను అనగానే 'ఇదే నా ఆఖరి ట్రిప్. మళ్ళీ వస్తానో లేదో' అని అన్నది. వెంటనే మా రెండో అమ్మాయి కలుగజేసుకుని 'ఏమిటమ్మా అలా అంటావు?' అని అన్నది. ఆవిడ మాట్లాడుతూ ' నువ్వు హైదరాబాద్ నుండి కాకినాడ

వెళ్ళిపోతున్నావు కదా అందువల్ల అలా అన్నాను' అన్నది. ఆరోజు ఆవిడ పుట్టినరోజు. హైదరాబాద్ ఆశ్రమంలో చాతుర్మాస్య దీక్షలో భాగంగా ఒక నెలరోజులు హైదరాబాద్‌లో కార్యక్రమాలు నిర్వర్తించే నిమిత్తం శ్రీమాతాజీ విచ్చేశారు. మేమిద్దరమూ హైదరాబాద్ ఆశ్రమానికి మాతాజీవారి దర్శనానికి వెళ్ళాము. మౌనధ్యాన సప్తాహ శిబిరం నిర్వహింపబడుతోంది. అప్పుడు సమయం మధ్యాహ్నం రెండు గంటలు. అది ధ్యాన సమయం కాబట్టి మాతాజీని కలవటానికి ప్రయత్నించలేదు. మేమిద్దరం ధ్యానంలో కూర్చుండిపోయాం. మా ధ్యాన సమయం అయిన తరువాత శ్రీమాతాజీని కలిశాము. శ్రీమాతాజీ మాట్లాడుతూ 'చూశారా! దేహబాధను మరచి 2గంటలు ధ్యానం చేసుకో గలిగారంటే అది కేవలం సద్గురుమూర్తి అనుగ్రహమే' అన్నారు. శ్రీమాతాజీ రాజకుమారిని ఆశీర్వదిస్తూ 'ధైర్యంగా ఉండండి. మనం గురుబిడ్డలం. మనకు భయమెందుకు? అన్నీ ఆయనే చూసుకుంటారు.' అన్నారు.

హైదరాబాద్ నుండి బయలుదేరే ముందు రాజకుమారిగారు మాట్లాడుతూ 'నాకు నా పరిస్థితి పూర్తిగా అర్థం అయింది. ఇది నా చివరి దశ అనుకుంటా. కొన్ని రోజులో, కొన్ని నెలలో లేక సంవత్సరమో. అయినా నాకు భయం లేదు. రాజకుమారి తమ్ముడు అమెరికాలో తన కొడుకు దగ్గరకు ప్రయాణమైనాడు. ఆ విషయం తెలిసి తమ్ముణ్ణి రమ్మని కబురుచేసింది. తమ్ముడితో మాట్లాడుతూ ' నువ్వు అమెరికా వెళుతున్నావు కదా! మళ్ళీ మనం కలుసుకుంటామో లేదో అని రమ్మన్నాను' అని అన్నారు. దానికి తమ్ముడు స్పందిస్తూ ' అలా అంటావేమిటమ్మా! నేను మూడు నాలుగు నెలల్లో వచ్చేస్తాను కదా!' అని అన్నాడు.

శ్రీమాతాజీవారి ఆదేశానుసారం శ్రీనివాస్ అమెరికా నుంచి వచ్చి మూడువారాలు మాతృసేవ చేసుకున్నాడు. శ్రీనివాస్ అమెరికా ఎప్పుడు వెళుతున్నా సాధారణంగా కంటతడి పెట్టే రాజకుమారి ఈ పర్యాయం మాత్రం కంటతడిపెట్టలేదు. సద్గురుదేవుల అనుగ్రహంతో మమకారం తొలగిపోయిన ఆమె సంతోషంగా వీడ్కోలు చెప్పింది.

హైదరాబాద్ నుండి నంబూరు చేరుకున్నాం. కాళీవనాశ్రమంలో శ్రావణ శుక్రవారం పూజ చాలా సంతృప్తికరంగా చేసుకున్నాము. గత కొలది సంవత్సరాలుగా శ్రావణమాసంలో ఈపూజను గుప్తంగా శ్రీమాతాజీవారి గృహంలో జరుపుకునేవారం. పూజాకార్యక్రమానికి మా కుటుంబ సభ్యులు అందరూ కూతుళ్ళు అళ్ళుళ్ళూ వచ్చారు. ఈ సంవత్సరం పూజ ప్రారంభానికి

ముందుగా రాజకుమారి మా అందరినీ హెచ్చరిస్తూ పూజాసామగ్రి, ప్రసాదాలు అన్నీ త్వరగా బృందావనానికి చేర్చండి. పూజ బృందావనంలో జరుగుతుంది' అన్నది. మేమంతా ఆశ్చర్యపోయాం. ఆవిడ మతి స్థిమితం లేక అలా హెచ్చరించిందని అనుకున్నవారూ లేకపోలేదు. ఎందువల్లనంటే పూజ జరుగ వలసింది మాతాజీ ఇంట్లో కదా. ఈ సంఘటన జరిగిన కొద్ది క్షణాలలో శ్రీమాతాజీ వారి వద్ద నుండి ఫోన్ వచ్చింది. పూజ బృందావనంలో 11గం॥లకు జరుగుతుంది. అన్ని ఏర్పాట్లు బృందావనంలో చేసుకోండి అని శ్రీమాతాజీ ఆదేశించారు. మాకందరికీ ఆశ్చర్యం వేసింది. రాజకుమారి మాత్రం ఆశ్చర్య పడలేదు. తాను చెప్పినట్లే జరిగినందుకు సంతోషించింది.

శ్రావణ శుక్రవార పూజ అనంతరం అస్వస్థత కారణంగా ఆమెను తిరిగి విజయవాడలో ఆసుపత్రిలో చేర్చవలసి వచ్చింది. పెద్దమ్మాయి రాధని ఫోన్‌చేసి పిలిపించమని హెచ్చరించారు. రెండవ అమ్మాయి మేధ మద్రాస్ నుండి హైదరాబాద్ వెళ్తుంటే టిక్కెట్ కాన్సిల్ చేసుకుని విజయవాడలో దిగవలసిందిగా ఫోన్ చేయమన్నారు. ముగ్గురు కుమార్తెలను దగ్గర కూర్చోబెట్టుకుని ఆరోజు రాత్రి సాధనపరంగా గురుపుత్రులు ఆచరించవలసిన అనేక ఆవశ్యకమైన సూచనలను చేసింది. రాజకుమారి మాట్లాడుతూ 'నేను చిన్నప్పటి నుంచీ బరువు బాధ్యతలతో బంధాలను వదులుకోలేక ఎంతో కాలం వృథా చేసుకున్నాను. అయినా గురులక్ష్యార్థాన్ని స్వీకరించినది మొదలు శ్రద్ధగానే సాధన చేస్తున్నాను. కాని నా జీవిత కాలంలో ఎక్కువ భాగం సేవకే వినియోగించాను. అనేక రకాల సేవలు చేశాను. ప్రసాదాలు చేయటమంటే నాకు చాలా ఇష్టం.

కానీ చూశారా! గురుదేవులు ఈరోజున ఆ సేవ నుండి నన్ను ఏ విధంగా తప్పించారో! ఇప్పుడు నేను ఎవ్వరికీ ఏ రకమైన సేవ చేయలేని స్థితిలో ఉన్నాను. పాపం! మీ నాన్నగారికి ఏ పని చేసుకోవటం చేతకాదు. ఇప్పుడు ఆయనతో అన్ని పనులు చేయిస్తున్నాను. గురుదేవులు నన్ను ఇలా మంచాన పడేస్తేగాని, నేను ఈ మిగిలిన సమయాన్ని ధ్యాన సాధనలో గడపనని కాబోలు ఇలా అనుగ్రహించారు. మీరందరూ గురులక్ష్యార్థం తీసుకున్నారు. మమకారాలు, బంధాలు పెట్టుకొని సాధన అశ్రద్ధ చేయకండి. తెల్లవారుజామున లేచి శ్రద్ధగా ధ్యానం చేసుకోండి. జన్మజన్మల నుండి ఆర్జించిన కర్మ రహితం అవుతుంది. నా లాంటి స్థితి తెచ్చుకోకండి' అని హితవు చెప్పారు.

-సశేషం

# ఆశ్రిత వత్సలుడు

(గతసంచిక తరువాయి)

-సుశీలా ప్రసాద

తిరిగి అక్రూరుని మధుర వాక్యాలు ఇలాగ వినవచ్చాయి వానికి ' అప్పుడు బలరామకృష్ణులు ఇద్దరూ నన్ను ఇంటికి తీసుకుని వెళ్ళారు. కుశల ప్రశ్నలు అడిగారు. ఆసనం ఇచ్చారు. పాదాలు కడిగి మధుపర్కం, గోవును సమర్పించారు. ఇలాటి అతిథి సత్కారాలతో ఆదరంచి, షడ్రసోపేతమైన భోజనం పెట్టారు. భోజనానంతరం తాంబూలం, గంధం, పూలమాలలు ఇచ్చారు.

నందుడు అప్పుడు సుఖాసీనుడై యుండి నన్ను చూచి దుష్టుడైన కంసుడు ఉండగా మీరు బాగున్నారా అని మీ క్షేమం ఎలా అడగను?' అని వ్యధా భరితమైన స్వరంలో పలికారు. కృష్ణుడు తన తల్లితండ్రులను గురించి అనేక విధాల ప్రశ్నిస్తూ ' ఇంతకీ నువ్వు ఏం పనిమీద వచ్చావు?' అని అడిగాడు.

కంసుడు నారదుడు వచ్చి చెప్పిన తరువాత దేవకి వసుదేవులను కారాగారంలో బంధించటం, గురించి చెప్పి ధనుర్యాగం పేరుతో వారిని తీసుకు రమ్మన్నాడని చెప్పాను. ఆ మాటలు వింటూ బలరామకృష్ణులు ఇద్దరూ నవ్వుకున్నారు. తరువాత కృష్ణుడు నందాదులందరినీ పిలచి 'యాగం చూడటానికి వెళ్ళాలి. కానుకలు తీసికొని వెళ్ళాలి. బండ్లు సిద్ధం చేసికొని రండి' అని చెప్పాడు. ఉదయమే ప్రయాణం అని చెప్పాడు.

నేను కృష్ణుణ్ణి తీసికొని వెళ్ళటానికి వచ్చానని విని గోపికలంతా ఎంతో బాధ పడ్డారు. కృష్ణ వియోగాన్ని సహించలేక ఆ బాధతో నన్నెంతో ఆడి పోసుకున్నారు. మాతో వారూ ప్రయాణమయ్యారు. తను మళ్ళీ వస్తానని నచ్చచెబుతూ కబురంపి మథురానగరికి ప్రయాణ మయ్యాడు శ్రీకృష్ణుడు.

కొంత దూరం గడిచేసరికి యమునా నది కనిపించింది. రామకృష్ణులిద్దరూ నది దగ్గరకు వెళ్ళి మంచినీళ్ళు తాగారు. నేను నదీ జలాలలో వేద మంత్రాలతో స్నానం చేస్తున్నాను. నిజంగా అది అపూర్వమూ, అపురూపమూ అయిన దివ్యానుభవం'. అక్రూరుని గొంతు ఆనందంతో

వణుకుతోంది. ఎందుకో సుదామునికి కారణం తెలియలేదు. మరింత చెవులొగ్గి వినసాగాడు. 'ఇది విను జల మధ్యంలో రామకృష్ణులు కనిపించారు. నీళ్ళు తాగి నది నుంచి వెళ్ళి రథంలో కూర్చున్నారు కదా అప్పుడే! ఇక్కడికి ఎలా వచ్చారని రథం వైపు చూస్తే రథంలోనూ ఉన్నారు. అటు చూస్తే అటూ, ఇటు చూస్తే ఇటూ రెండు చోట్లా కనిపించారు. నా కళ్ళని నేను నమ్మలేదు. ఇంకా మహాద్భుతంగా బలరాముడు శేషుడై, శ్రీకృష్ణుడు ఆదివిష్ణువై శేషశయనుడైన శ్రీహరిని నీళ్ళల్లో దర్శించాను. బ్రహ్మానందంలో తలమునకలవుతూ స్వామిని స్తోత్రం చేశాను. అప్పటి నా అనుభవం మాటలలో ఎలా చెప్పటం?'

అక్రూరుని మాటలు వీనుల విందై సుదాముని కళ్ళ వెంట నీటి ప్రవాహాలవుతున్నాయి. నిరాటంకంగా ఆసాంతం వినే అవకాశం ఆ దైవమే కలిగించాడు కాబోలు సుదామునికి. 'అలాగ ఎంత సేపు ఉండిపోయానో! స్వామి మాయమైపోయిన తరువాత మెల్లిగా రథం దగ్గరకి వచ్చి చూస్తే ఏమీ ఎరుగనట్లు అక్కడే ఉన్నారు అన్నదమ్ములిద్దరూ. పైగా నీళ్ళు దగ్గరగానే ఉన్నాయి. నువ్వు వెళ్ళి చాలా సేపు అయింది. భూమి ఆకాశాల మధ్య చూడని వింతలేమైనా నీళ్ళల్లో కనిపించాయా?' అని అడిగాడు కృష్ణుడు. నీలో లేని చోద్యం లోకాలలో ఎక్కడ ఉంటుంది దేవా! అన్నీ నీలోనే ఉన్నాయి కదా అని చేతులు జోడించి పలికాను.

అయితే ఇక్కడకి ఎప్పుడు చేరారు స్వామీ? అన్నది అక్రూరుని సతి. సాయంకాలానికి కను చీకటి వేళకి మధురకు చేరుకున్నాం. నా కంటె ముందు చేరిన నందాదులు ఊరి వెలుపల ఉన్న ఉద్యానవనంలో బళ్ళను ఆపారు. వాళ్ళను చేరి కృష్ణుడు నాతో నువ్వు రథం తీసికుని నగరానికి వెళ్ళు. మేము వెనకాల వస్తాము అన్నాడు. మన ఇంటికి దయచేయమని సాక్షాత్తు పరమేశ్వరుని మీరు వేడుకోలేదా? అని అడిగింది అక్రూరుని ఇల్లాలు. ' అయ్యో! అడగకేమి? నా ఇంటికి రావయ్యా! నీ పాద ధూళి సోకి, నా ఇల్లు పావనం అవుతుంది. నీ సేవకుణ్ణి మన్నించు ప్రభూ!' అని చేతులు జోడించి మ్రొక్కుతూ ప్రార్థించాను. 'మదోన్మత్తుడైన కంసుణ్ణి చంపి, అప్పుడు మీ ఇంటికి వస్తానని' చెప్పి రథం తీసికొని వెళ్ళమని చెప్పాడు కృష్ణుడు. స్వామి ఆజ్ఞ తలదాల్చి ఇలాగ వచ్చేశాను. అక్రూరుని నిట్టూర్పు వినవచ్చింది సుదామునికి. ఇక సవ్వడి చేయకుండా ఇంటికి తిరిగి వచ్చేశాడు లోనికి వెళ్ళకనే.

-సశేషం

# మాతాజీ బోధామృతం

(గత సంచిక తరువాయి) - శివ ప్రసాద్

మననం చేసేది మంత్రం. మంత్రాన్ని మననమే చేయాలి. మననం ఎంత వరకు చేయాలి అంటే మనస్సు లేకుండా పోయేటంతవరకు. మనస్సు లయించేంటంత వరకు. ఇప్పుడు రామ రామ రామ రామ అని వినిపిస్తున్నది కదా. గ్లాసులు సర్దటము, ఫ్యాన్‌లు వేయటం వంటి పనులు చేస్తున్నా అలవాటు కొద్దీ ఈ రామ రామ నడిచిపోతుంటుంది.

కానీ భగవంతుడు యాక్సెప్ట్ చేసేదీ మనం కూడా అక్కడ యాక్సెప్ట్ చేసేది మనస్సు. ఆ మనస్సు నిలవకపోతే ఆ పాడేవాడు, 'వాడు నా వంక చూశాడు' అంటాడు. మనస్సు అక్కడ లేకపోతే వాడు చూసినట్లు ఎలా తెలుస్తుంది? మనం అడగవచ్చు 'వాడు చూశాడు సరే వాడు చూసినట్లు నీకు ఎలా తెలిసింది? నీవూ చూస్తేనే కదా! మరి నీవెందుకు చూశావు?' అని.

ఇలాంటివన్నీ మనకు అర్థం కావు. అందుకే సజ్జన సాంగత్యం కావాలి అన్నది. ఇలాగ మనం ఎన్నిటినో నిరోధించవచ్చు. ఒకవేళ వాడు నిజంగా చూశాడు అనుకుందాం. చూస్తే మనలో నుంచి వాడు ఏం తీసుకుంటాడు? వాడికున్నది వాడు తింటాడు. మనకున్నది మనం తింటాం. అసలు మనకి ఏం లోటైంది?

ఎవడో ఏదో చూశాడు, ఎవడో ఏదో మాట అన్నాడు అని మధ్యలో మనం కుళ్ళి కృశించటం చిన్న పిల్లలు అలిగి కంచంలో తింటున్న అన్నంలో నీళ్ళుపోసి, తన్నేసి మారాం చేసినట్లు ఉంటుంది. ఆ పిల్లవాడు బొమ్మ కావాలంటాడు. వాళ్ళమ్మ బొమ్మ ఇవ్వదు. ఇవ్వకపోయే సరికి వీడు అలిగి ఆ తినే అన్నంలో నీళ్ళు పోస్తాడు. కాని బొమ్మ కోసం తినే తినే అన్నం వదిలివేయటం దేనికి? వాడు పేచీ పెట్టినట్లే మనం కూడా ఇంత వయస్సు వచ్చినా, ఈ మనస్సు పెట్టుకుని, ఈర్ష్యా అసూయలు పెట్టుకొని విషయాదులు పెట్టుకొని, ఇంకా అల్లరి చేష్టలే చేస్తున్నాము.

వాడు తెలియక చేస్తున్నాడు. మనం తెలిసి చేస్తున్నాం. కాని గుర్తించటంలా. దానిని గురించి విచారణ జరగటంలా. విచారణ జరిగితే

మనస్సును కంట్రోల్‌లో పెట్టుకోగలుగుతాం. మనం పిల్లలను అయితే కనగలం కాని, వాళ్ళ కర్మలను కనగలమా? వాళ్ళ జీవితం వాళ్ళదే. మన జీవితం మనదే. కాని మన ధర్మం ఎంతవరకు? పిల్లలను కన్నందుకు వాళ్ళ ఆలనా పాలనా చూసి, వాళ్ళకు ఒక మంచి మార్గాన్ని చూపించేంత వరకు.

గురువులు అవతార పురుషులు కూడా బాధ్యత వహించి, మనలను తీసికొని వస్తున్నారు. ఏమని? మనలను తరింపచేస్తాము అని. మనలను అనుగ్రహించి తరింపజేయటానికి అవతరించిన మహాత్ములను ఎలా ఆశ్రయించాలి? ఒక మహనుభావుడిగా, ఒక దైవస్వరూపుడిగా, ఆశ్రయించాలి.

బాబూజీ మహరాజ్ అంటూండేవారు భగవంతునికి చాలా తిప్పలుట. భగవంతుడు అవతారం ధరించి రాకపోతే ఆ కనిపించని భగవంతునికోసం ఏమిటి మనం ప్రాకులాడేది అంటాడు మానవుడు. ఒకవేళ అనుగ్రహించి ఒక శరీరం ధరించి వస్తే, రెండు చేతులే ఉన్నాయి. చేతికి అయిదు వేళ్ళే ఉన్నాయి అంతా మనకు మల్లేనే ఉన్నాడే అని ఇలాంటి పోలికలు చూస్తారు. బాబూజీ నాకన్న పొట్టా? పొడుగా? అనుకుంటారు. బాబూజీ కూడా తమాషాలు చేసేవారు. వాడి ప్రక్కన నిల్చుని ఏమయ్యా! నీవు నా కన్న పొడుగా? పొట్టా? అని అడిగేవారు. వాడికి చావకుండా చచ్చినంత పని అయ్యేది. ఎందుకంటె వాడు ముందర అలాగ ఏదో మనస్సులో అనుకున్నాడు కదా. అలా ఉంటాయి మహాత్ముల లీలలు.

మనస్సు మనలను పీడిస్తుంది. అలా అని మనం ఎక్కడికో వెళ్ళనక్కర్లా. ఏమీ అవనక్కర్లా. మనకు కావలసింది తృప్తి. భగవంతుడి దగ్గర కూడా భోగభాగ్యాలు అడిగి ప్రయోజనం లేదు. భగవంతుడు కూడా మనకు ఏమి హెచ్చరిక చేశాడు? 'నిన్ను నీవు తెలుసుకో. నిన్ను నీవు తెలుసుకుంటే నేనంటే ఏమిటో తెలుస్తుంది' అని.

అప్పుడింక వారు శరీరంతో వచ్చారా? పంచ కట్టుకున్నారా? ప్యాంట్ వేసుకున్నారా? వంటి మాటలు అవసరం లా. మహాత్ములను పట్టుకొని వారు తింటారా? త్రాగుతారా? ఇంతకూ వారు ఎవరు? ఏ ప్రాంతం? అని అడుగుతున్నాం.

-సశేషం

# మాతాజీ సత్సంగ్ డైరీ

-రమణ ప్రసాద్

శ్రీమాతాజీ భాగ్యనగర శాఖలో జరిపిన తమ చాతుర్మాస్య దీక్షలో జూలై 23న ప్రాతఃకాల సమయంలో చేసిన ప్రసంగం ఇక్కడ ప్రచురిస్తున్నాము

-ఎడిటర్

నిజమైన భక్తునికి రాత్రి నిద్ర పట్టదు. కాలం అయిపోతోంది. సాధకుడు ఎప్పటికప్పుడు జాగ్రత్త వహించి దేనిని పొందితే ఇక పొందవలసినది ఏదీ లేదో దానిని పొందటానికి కృషిచేయాలి. శబరి, గుహుడు, ఆ స్థితిని పొందారు. మనలో ఉన్న శాంతిని పొందటానికి లోచూపు రావాలి. అప్పుడు లోపలి ప్రశాంతత ఇంకా ఎంతో ప్రకాశిస్తుంది. అటువంటి బ్రహ్మవిద్య అభ్యసించే అవకాశం మనకి శ్రీ గురుదేవులు ఇచ్చారు.

అవసరమైన దానిని పట్టుకోవాలి. అనవసరమైన వాటిని వదలివేయాలి. భగవంతుని పొందాలని ఆవేదన ఉండాలేకాని, భగవంతుడు అందనివాడు కాదు. అందేవాడు, అందరివాడు. 'నేను నీ వాడనే నీకు భిన్నంగా లేను' అంటాడు భగవంతుడు. ఆ అనుభూతిని మనం పొందాలి మనం ఆశించిన బ్రహ్మతత్త్వం మనలో నిండి ఉంది. మనం -

దేవదేవా! నీకృపచే మానవునికి మానవునికీ మధ్య భేదబుద్ధి నశించి సర్వజీవులు సమ భావముతోను ప్రేమ దృష్టితోను మెలగుదురుగాక! లోకములన్నియు శాంతి సౌఖ్యములతో వర్థిల్లునుగాక! అనిప్రార్థన చేస్తాం.

తనవారు వేరు ఇతరులు వేరు అనే భావం ఎంత గాఢంగా పేరుకు పోయిందో 'నా' ' నీ', ' పర ' అనే భేద దృష్టితో చూస్తే శాపం ఇచ్చేంత కోపం వస్తుంది. పరమాత్మ దృష్టి కలిగి ఉండాలి. పరదృష్టి ఎక్కువైంది. ఇది నీ కృపచేతే తొలగాలి ప్రభూ! అని ప్రార్థించుకోవాలి.

ప్రాతఃకాలంలో గురుపాదాన్ని తలుచుకుని ఆ పాదాలను అంతరంగంలో ధారణచేసి గురువు చెప్పిన పదాలను మనన నిదిధ్యాసలలోకి తెచ్చుకోవాలి. అది అందరం కలిసి చేసుకుంటే ఎంతోఆనందంగా ఉంటుంది.

సర్వజీవులు సమభావంతో ఉండటం అంటే ఆత్మభావంతో ఉండటం. ఆత్మీయతగా ఉండటం. ప్రేమదృష్టి కలిగి ఉండటం. అది మారే

ప్రేమ కాకూడదు. సత్యప్రేమ. గురుసేవలో మనమందరము ప్రేమదృష్టితో మెలుగుదాం. అప్పుడు లోకములు శాంతి సౌఖ్యములతో వర్ధిల్లుతాయి.

ప్రభూ! అనుక్షణమును అంత్యకాలముననూ నీ స్మరణమే మా జిహ్వాయందు నిలచుగాక! నీ రూపమే మా మనస్సునందు నిలచియుండుగాక! ఈ జన్మమే మా కడసారి జన్మమై నీ సాయుజ్యమును పొందించుగాక!

పాహిమాం! పాహిమాం! పాహిమాం! పాహి!

ఏది వచ్చినా "ప్రభూ!" అనుకో. కాలునొప్పి పెడితే ప్రభూ! అనుకుంటే ఆ నొప్పి పోతుంది. ప్రభూ! బాబూ! నాయనా! కన్నయ్యా! అని ఆర్తిగా మనసారా పిలు. ఆయన నీ ప్రార్థన వింటాడు. నమ్మకము విశ్వాసము ఉంటేనే ఆ స్మరణ వస్తుంది. స్థూలదేహానికి స్మరణ, సూక్ష్మదేహానికి రూపం. ఈ జన్మమే మా కడసారి జన్మమై - బ్రతికుండగానే చావాలి.
నీ సాయుజ్యము పొందుదుముగాక - అనే దృఢ నిశ్చయంతో సాధన చేయాలి.

గురుదేవులముందు కూర్చున్నాం. దేహధ్యాస తగ్గి మనస్సు నిర్మలమైంది. అలా నిర్మలమైన మనస్సును లక్ష్యార్థ భావనలో లయం చెయ్యాలి. 'ప్రభూ! నీ రూపాన్ని ఆరాధించి, దేహస్మృతిపోయి సారూప్యం పొందాలి. నీ సామీప్యంలోనే ఆనందం పొందాలి.' అని మనసారా ప్రార్థించాలి. ఆ ఆస్వాదన పొందాలంటే శుద్ధ మనస్సు ఉండాలి. సారూప్యం అంటే "నువ్వే-నేను"గా ప్రకాశించే స్థితి. ఈ జీవితం ఉండగానే సుషుప్త్యావస్థలో పొందే హాయిని జాగ్రదవస్థలో పొందాలి. 'అప్పుడు మనోలయం ముక్తి లయం యథార్థం' అని గ్రహిస్తావు. ప్రభు భావనతో ఉండటమే సాయుజ్యం.

ఇతర విషయాలను, తగ్గించి, అంటే ఎంత వరకు ఉండాలో అంతవరకు ఉంటూ, మీ మనస్సును గురుదేవుల దివ్యచరణారవిందములకు అర్పించుకోవాలి. అప్పుడు ఈ జన్మ కడసారిజన్మ అవుతుంది.

ప్రాతరేవహిమానసాంతర్భావయే ద్గురుపాదుకాం. మనస్సు ధ్యేయ వస్తువుపై నిలుపు. మనస్సు నిర్విషయం చేసుకో, అదే ధ్యానం. **ధ్యానం నిర్విషయం మనః** అని చెప్తోంది స్కందోపనిషత్తు. 'నీ భావనలో ఉంటున్నాను. నీ ఆకృతినే ఆరాధిస్తున్నాను' అనే భావంతో ఉండాలి. అర్చనలోంచి నిర్గుణతత్త్వంలోకి పోవాలి. గురుదేవుల నిర్గుణ నామాలు ఎంతబాగుంటాయో! 'నిర్వికారాయ నమః', 'నిరాధారాయనమః', 'నిస్సంగాయనమః', 'నిష్కళంకాయనమః', 'నిరంజనాయనమః'--- ఈ నామాలు వింటూ స్వామి ఎంత ఆనందపడేవారో!

'శ్రీ సమంచిత' మంగళకరమైన సమచింతన కలిగి ఉండాలి, 'అవ్యయం' అంటే నాశనము లేనిది, వ్యయంకానిది. అది పరమ ప్రకాశము, అగోచరము, భేదవర్జితము, అప్రమేయము, అనంతము, ఆద్యంతములు లేనిది, అకల్మషము, కల్మషము లేనిది. అప్రతర్క్యమైనది. అబోధకము అనుభవైకవేద్యమైనది.

అట్టిది గురుపాదం. అది ఎవరికి కాకుండా ఉన్నది? అట్టి సర్వవ్యాపకమైన గురుపాదాన్ని మనస్సులో సదా భావించాలి - **'మానసాం తర్భావయే ద్గురుపాదుకామ్!** ఆ పాదాలను అంతరంగంలో ప్రతిష్ఠించుకొని సాధన చేయాలి. అప్పుడే ఈ జన్మ మన కడసారి జన్మ అవుతుంది. గురుసాయుజ్యాన్ని పొందుతాము. అట్టి శక్తిని భక్తిని మీకు సద్గురుపాదుకలు ప్రసాదించుగాక సుఖీభవ! సుఖీభవ!!




సమర్థ సద్గురు తెలుగు మాస పత్రిక, సమర్థ సద్గురు ఆంగ్ల త్రైమాసిక పత్రిక ఇకముందునుంచి **"యోగిని శ్రీ చంద్ర కాళీ ప్రసాద మాతాజీ చారిటబుల్‌ట్రస్ట్"** వారి ఆధ్వర్యాన వెలువడుతున్నాయి. ఈ పత్రికలలో వెలువడే శీర్షికలలో ఏ మార్పులు ఉండవు. ఈ పత్రికలకు చందాదారులుగా ఉన్నవారు, చందాదారులుగా చేరేవారు దయచేసి ఇకముందునుంచి చెక్కులరూపంలోగాని, డ్రాఫ్ట్‌రూపంలోగాని కట్టే చందాలను ఈ క్రింద సూచించిన చిరునామాకు పంపగలరు.

Manager
Y.S.C.K.P.M Charitable Trust, A/c - Samardha Sadguru Magazine.

మనీ ఆర్డర్ పంపేవారు పూర్వం వలెనే
The Manager
Samardha Sadguru Magazine.

ఎడ్రస్‌కు పంపగలరని ప్రార్థిస్తున్నాము.

# సమర్థ సద్గురు నాధుని దివ్య చరిత్ర

- స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

**శుభాశీః పూర్వక ప్రస్తావనము** (పూజ్యశ్రీ మాతాజీ)

శ్రీమంత మఖిల సంసేవ్యంబు సద్గురు చరితంబు సకలార్థ సాధకంబు

మహాత్ముల దివ్య చరిత్ర అనే అమృతమును గ్రోలిన వారికి చతుర్విధ పురుషార్థములూ సిద్ధిస్తాయి. ఆ అమృతపానంలో మత్తిల్లి మైమరచిన మానవునికి తన శరీర స్పృహ, తన చుట్టూ ఉన్న ప్రపంచ స్పృహ కూడా లేకుండా పోతాయి. స్పృహ లేకుండా పోవటం మాత్రమే కాదు; అసలు శరీరము ప్రపంచము అనేవే లేవనీ, అనాదిగా ఉన్నదీ, ఎప్పుడూ ఉండేదీ సద్గురు రూపమైన సత్యవస్తువొక్కటేననీ, అదే తన నిజ స్వరూపమనే ఆత్మానుభవం నిలిచిపోతుంది.



సత్యవస్తువు అణువు కంటె సూక్ష్మమైనది. కాని విశాలమైన ఈ సృష్టి రూపంలో అనంతమైన చైతన్యశక్తిగా ఆ సత్య వస్తువే ప్రకాశిస్తున్నది. ఆ సత్తు చిత్తుల మధ్య గల గమ్మత్తును పూర్తిగా గ్రహించి, అదంతా హుళక్కేననీ, ఉన్నది తానొక్కడేననీ తెలియజెప్ప గలిగినవారు ప్రజ్ఞానఘన స్వరూపులైన గురుదేవులు మాత్రమే. ఈ సత్యమునే వెల్లడించే

**మూలాభావ మిదం జ్ఞాతం । శరీరం నాస్తి కేవలం ।**
**స్వప్నే ప్రతీయ మానాని । రూపాని యధా తధా ।**
**అయం వ్యర్థో బాహ్యః । కోzపి న భవతి ॥**

మొదలైన మహత్తర వాక్యములెన్నిటినో అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినంత సులువుగాను, తియ్యని తేట తెనుగులో స్పష్టంగాను అనుభవ పూర్వకంగా అందించినవారే మన ప్రియతమ గురుదేవులు శ్రీశ్రీశ్రీ హనుమత్కాళీ వరప్రసాద బాబూజీ మహరాజ్‌వారు. అట్టి శ్రీ సద్గురుదేవుల మహత్తర చరిత్రను, కన్నులు కలిగినందుకు సార్థకంగా చదువుకోవటానికి, కర్ణేంద్రియములు కలిగినందుకు సార్థకంగా వారి దివ్య లీలావతార వైభవాన్ని

గురించి శ్రవణం చేయటానికి, మనసారా మాటిమాటికీ మననం చేసుకోవటానికి అమూల్యమైన సదవకాశం మనకీనాడు లభించింది. ఇది నిస్సంశయంగా శ్రీ సద్గురుదేవుల నిర్హేతుక పరమానుగ్రహము; మనందరి మహాభాగ్యము.

రూపనామ క్రియారహితమైన శ్రీపరమాత్మ తత్త్వమే శ్రీ సద్గురు రూపం ధరించి, మానవులను ఉద్ధరించటానికి అవతారం ధరించి వచ్చింది. అట్టి శ్రీ గురుదేవులను ఎవరని, ఏమని, ఎంతని వర్ణించగలము? హరిహరాదులకు కూడా అందరాని ఆ గురు తత్త్వమును తెలుసుకోవటం ఎవరి తరమౌతుంది? దేశకాలములకు అతీతమైన గురుతత్త్వము ఏ కాలానికి, ఏ దేశానికి చెందినదని చెప్పగలము? చెప్పనూ లేము; ఊహించనూ లేము. కాని భాషకూ, భావానికీ అందని శ్రీ గురుతత్త్వము యొక్క మధురానుభవాన్ని మాత్రము, శ్రీ గురుకృప వలన తప్పకుండా పొందగలము.

తన నాభి కమలం నుండి ఉద్భవించిన బ్రహ్మ "నేనెవరిని?'' అని తికమక పడినపుడు, శ్రీమన్నారాయణుడు (గురుదేవుడు), బ్రహ్మదేవునికి (శిష్యునికి) నారాయణోపనిషత్తు ద్వారా తన నిజ తత్త్వమును గురించి ఇలా చెప్పాడు. సకల దేవతలు, వేదములు, జీవరాసులు, మనోబుద్ధులు, దశేంద్రియములు అన్నీ నా నుండే పుట్టాయి. **(నారాయణాదేవ సముత్పద్యన్తే)**. నేనిచ్చిన ప్రాణశక్తితోనే అవి పని చేస్తున్నాయి. అవి నన్ను గురించి ఏమి చెప్పగలవు? నిజానికి నన్ను గురించి చెప్పేది గాని, నా కంటె వేరైనది గాని రెండవది ఏదీ లేదు. **(నద్వితీయోzస్తి కశ్చిత్)**

కనుక నన్ను గురించి నేనే చెబుతున్నాను విను. నన్ను మాత్రమే అనన్య భావంతో స్మరిస్తే, నేనుండే వైకుంఠానికి వచ్చి నన్ను చేరుకోగలవు. ఆ వైకుంఠం ఎక్కడో లేదు. నీ హృదయమనే పద్మమే (పుండరీకమ్) ఆ వైకుంఠం. అందులో నేను తటిత్తులాగా, అంటే మెరుపు లాగ ఎప్పుడూ ప్రకాశిస్తూ ఉంటాను **(తదిదం పరం పుండరీకం విజ్ఞాన ఘనం। తస్మాత్తటి దాభ మాత్రం)**. అంతేకాదు అవసరమైనప్పుడు, ధర్మోద్ధరణ కోసం మానవాకారం ధరించి బ్రహ్మణ్యుడైన దేవకీపుత్రుని వలె గురువునై అవతరిస్తాను. **(బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః)**

అంతమాత్రం చేత నన్ను మానవ మాత్రునిగా భావించక, నామ రూప గుణ దోష రహితుడనని, దేశకాలాతీతుడనని, సకల సృష్టికి కారణమైన

వాడనని, ఆదిమధ్యాంతములు లేనివాడనని, అకారణుడనని, కేవల పరబ్రహ్మనని తెలుసుకొనుము. **(కారణ పురుష మకారణం పరబ్రహోమ్ం).**

బ్రహ్మదేవునికి శ్రీమన్నారాయణుడు పైవిధంగా తెలిపిన నిజతత్త్వమే శ్రీగురుతత్త్వము. 'who am I ?' అని మధన పడుతున్న ప్రతి మానవునికి సద్గురుదేవులు వెల్లడిచేసి అనుభవింపజేసే ఆత్మతత్త్వమిదే. కనుకనే శ్రీ బాబూజీ మహరాజ్ వారు ఆశ్రమంలో రోజూ జరిగే ప్రాతఃకాల ప్రార్థన కార్యక్రమంలో శ్రీమన్నారాయణోపనిషత్తును పఠింపజేయటమేగాక, అనేకమార్లు సమావేశాలలో యీ ఉపనిషత్తు యొక్క అర్థాన్ని వివరింపజేశారు.

శ్రీ గురుదేవులు తమ ముఖస్థగా వెలువడిన "ఎవరికి తెలియగ తరమౌను బాబును?", "బ్రహ్మ జ్ఞానికి ఒక దానిపైనే ఆశ", "మాయా లోకమురా! మూఢా", "మమకారములో పడకుమురా" మొదలైన కీర్తనలను, "ఖేలతి బ్రహ్మాండే ! భగవాన్", "బ్రూహి ముకుందేతి" మొదలైన శ్రీసదాశివ బ్రహ్మేంద్రులవారి కీర్తనలను పాడించుకుంటూ, వివరణను అందిస్తూ, తద్వారా గురు తత్త్వసారమనే అమృతాన్ని భక్తలోకానికి అందించారు.

ఆట పాటలలో బాలబాలికలతో కలసి అల్లరి చేసిన ఆ అతి సుకుమార మూర్తియే, తత్త్వవేత్తల మధ్య సంచరించినప్పుడు అనంత ప్రతిభా ప్రకాశంతో, అనంత శయనుడైన పురుషోత్తముని వలె అందరిని అబ్బుర పరచి, అలవోకగా ఆత్మతత్త్వాన్ని విశదీకరించి, నిజపండితులను ఆనందపరుస్తూ వాచావేదాంతుల ఆట కట్టించిన మహత్తర సన్నివేశాలు అనేకంగా మనకీ గ్రంథంలో కనిపిస్తాయి.

అద్భుతము, మధురాతి మధురము అయిన శ్రీ గురుతత్త్వాన్ని అణుమాత్రంగా అందుకోగలిగినా తనువూ, మనసూ ఆనందంతో పరవశించిపోతాయి. ఆ ఆనంద పారవశ్యాన్ని తాము అనుభవిస్తున్న నా గురు సోదరులు శ్రీ విజయేశ్వరానంద ప్రసాద్, తన భక్త సోదరులందరికి యథాశక్తిగా దాన్ని అందించవలెననే మహదాశయంతో, శ్రీ సద్గురుదేవుల దివ్య చరిత్రములోని మొదటి భాగమును యిలా మనకు అందించినందుకు వారెంతైనా అభినందనీయులు.

శరీరానికి శస్త్ర చికిత్స చేసేటప్పుడు బాధ తెలియకుండా డాక్టర్లు మత్తుమందు (క్లోరోఫార్మ్) యిస్తారు. అప్పుడు శరీర అవయవాలతో మనస్సుకు గల సంబంధం విడిపోతుంది. కాని కొంతసేపటికి దాని ప్రభావం తగ్గిపోగానే

తెలివి, దానితోపాటు దేహబాధ మళ్ళీ మొదలౌతాయి. అంతేకాక ఆ మందు మోతాదు ఎక్కువైతే ప్రాణాపాయం కూడా సంభవిస్తుంది. కానీ, భగవన్నామ రసాయనము, భగవత్కథా శ్రవణమనే మధుర పదార్థము ఎంత స్వీకరించినా అపాయము లేనిది, మరింతగా మైమరపించేది, ఎటువంటి దుష్పరిణామాలు (side effects) లేనిది. శ్రీ సద్గురుదేవుల కథామృతం సేవించిన కొలది మన శారీరక, మానసిక రోగ బాధలన్నీ సమసిపోయి పరిపూర్ణ ఆరోగ్యము చేకూరుతుంది. అటువంటి శ్రీ సద్గురు దివ్యలీలా వైభవమనే రసాయనాన్ని సేకరించి మనకు అందిస్తున్న శ్రీ విజయేశ్వరానంద ప్రసాద్ జీవితము సార్థకము.

అలనాడు లీలామానుషుడైన శ్రీకృష్ణపరమాత్మ యమునాతీర సైకత స్థలాలపై నృత్య గీత గానాదులు సలుపుతూ గోప గోపీ జనాన్ని ఆనందంతో మైమరపించాడు. అలాగే శ్రీ గురుదేవులు ప్రతిరోజు ఉభయ సంధ్యలలో 'శ్రీరామ జయరామ జయజయరామ' అనే త్రయోదశాక్షరీ మహామంత్రాన్ని 'హరేరామ హరేరామ రామరామ హరేహరే, హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే' అనే షోడశాక్షరీ మహామంత్రాన్ని భక్తులందరితో కలసి గానం చేస్తూ, వలయాకారంగా చేతులు కలిపి నృత్యం చేస్తూ, చేయిస్తూ ఆనంద రసాంబుధిలో ఓలలాడించేవారు. అవి కేవలం భగవంతునితోనే కలిసి కాలాన్ని మరచి గంటల తరబడి గడపిన మహత్తర దివ్య క్షణాలు !

అలా కదిలే భగవంతునితో గానం చేస్తూ, నడిచే భగవంతునితో నాట్యం చేస్తూ, మాట్లాడే భగవంతునితో మధురాలాపాలు చేస్తూ మా గురు సోదరులందరి పూర్వ జీవితాలు నిత్యకాలంలో జమ అయిపోయాయి. అది ఘటనాఘటన సమర్థులూ, నటన సూత్రధారులూ అయిన శ్రీగురుదేవులు భక్తులపై వరదలుగా వర్షించిన వరాల పంట.

మానవుడు ఏదైనా ఒక రసానుభూతిలో మునిగి ఉన్నపుడు తన ఆనందాన్ని గురించిగాని, అనుభూతిని గురించిగాని వర్ణించలేడు. అది ముగిసిన తరువాతనే దానిని వర్ణించటం సాధ్యమవుతుంది. నిజానికి తమ అవతార కాలంలోనే శ్రీ గురుదేవులు తమ చరిత్రను వ్రాయటానికి శ్రీ విజయేశ్వరానంద ప్రసాద్‌కు అనుమతిని ప్రసాదించారు. కాని మా ఆస్థాన కవీంద్రులు శ్రీవిజయేశ్వరానంద ప్రసాద్ ఆ సమయాలలో మాతో బాటు శ్రీ స్వామితో సంచరిస్తూ, సంభాషిస్తూ, శ్రీవారి దివ్య బోధలను ప్రత్యక్షంగా ఆలకిస్తూ, ఆనందిస్తూ శ్రీ స్వామి అనుగ్రహ ప్రసాదాన్ని పుష్కలంగా అనుభవిస్తూ నిత్య

దర్శన, స్పర్శన, సంభాషణ, వందనాదులతో కూడిన ఎన్నెన్నో అమూల్యమైన అనుభూతులను పొందుతూ తమను తామే మరచిపోయి ఉండటం వలన చరిత్ర రచన సాధ్యం కాలేదు. ఇప్పుడు మధుర స్మృతులుగా మిగిలిపోయిన శ్రీగురుదేవుల అవతార విశేష వైభవాలను, లీలా మాధుర్యమును చక్కగా పునరాలోచించుకుంటూ గురుసోదరులందరితో ఆ ఆనందాన్ని పంచుకొంటూ, శ్రీసద్గురునాధులతో సంచరించి తరించిన సద్భక్తుల మధురానుభవాలను సంకలనం చేసుకుని యిలా శ్రీ సద్గురునాధుల దివ్య చరిత్ర అనే యీ గ్రంథరాజమును భక్తకోటికి అందించగలిగారు.

నా చిన్నతనంలో శ్రీ సద్గురుదేవులు, మహాకవి కాళిదాసు రచించిన రఘువంశము, మేఘసందేశము మొదలైన మహాగ్రంథాలను నాచేత చదివించారు. రఘు కులేశ్వరుడైన శ్రీరామచంద్రప్రభువు అవతరణకు మూలమైనది రఘు వంశము. ఆ పవిత్ర గ్రంథ రచనకు సంకల్పించిన శ్రీకాళిదాస మహాకవి **'క్వ సూర్య వంశ ప్రభవః? క్వచాల్ప విషయా మతిః?'** అంటే ఆ సూర్యవంశ వైభవమెంత గొప్పది? దానినిగూర్చి వ్రాయడానికి పూనుకొన్న నాకుగల బుద్ధి ఎంత అల్పమైనది? అని తమ్ముతాము ప్రశ్నించుకున్నారు.

అటువంటి శ్రీరామ, శ్రీకృష్ణ అవతార రహస్యాలను అందించగలిగిన శ్రీసద్గురుదేవుల చరిత్ర యింకెంత మహత్తరమైనది! కనుకనే నా గురు సోదరులు విజయేశ్వరానంద ప్రసాద్ **'చరితం తవ దివ్య మనంత మహం । పరిభావితు ముత్సహితోస్మి గురో । పరయా కృపయా పరిపాలయ మాం। శరణాగత వత్సల! ప్రేమనిధే ।'** అని, **'అనల్పం మమ సంకల్పమ్। అత్యల్పం మమశేముషీ । వందే సంకల్ప సిద్ధ్యర్థం । శ్రిత కల్పతరుం గురుం ।'** అని ముందుగానే శ్రీగురుదేవులకు మనవి చేసుకుని శరణు పొందారు. ఆశ్రిత రక్షణ తత్పరులైన స్వామి కృప వలన వారికి 'సంకల్పం కల్పించినదీ గురుదేవులే. దానిని నెరవేర్చుకొనేదీ వారే' అనే పట్టుకొమ్మ దొరికింది. భక్తునికి ఆ విశ్వాసం కుదిరినప్పుడు తన ప్రమేయమేమీ ఉండదు. ప్రమేయమూ, ప్రమాణమూ రెండూ శ్రీ గురుదేవులే. అవధులెరుగని ప్రమోదము మాత్రము భక్తునిది. ఆ ప్రమోదము తాము పొందుతూ తమ భక్త సోదరులందరికి అందిస్తున్న శ్రీ విజయేశ్వరానంద ప్రసాద్ ధన్యజీవులు!

శ్రీ విజయేశ్వరానంద ప్రసాద్ పూర్వ నామధేయం శ్రీ గూడూరి వెంకట రత్నంగారు. వీరికి జన్మనిచ్చిన జననీ జనకులు శ్రీ గూడూరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు (బళ్ళారిశాస్త్రిగారు), శ్రీమతి సుబ్బలక్ష్మమ్మగారు. వీరిరువురు పరమ పూజ్యులైన శ్రీ కందర్ప పరశురామయ్యగారి శిష్యులు. శ్రీ పరశురామయ్యగారు శ్రీ సద్గురుదేవులను ప్రథమంగా దర్శించినప్పుడే, వారిని తమ ఆరాధ్య దైవమైన బాలరామునిగా గుర్తించి అనన్య భక్తి ప్రేమ భావనలతో శ్రీగురుదేవులను ఆరాధించుకున్నారు. వయస్సురీత్యా వారు శ్రీ గురుదేవులను తమ జ్ఞాన పుత్రునిగా సేవించుకున్నారు. జ్ఞాన మార్గాన్వేషణలో ఏ శాస్త్రముల ద్వారాగాని, పండితులతో వేదాంత చర్చల ద్వారాగాని పొందలేని అలౌకిక ఆనందమును, సంతృప్తిని శ్రీ పరశురామయ్యగారు శ్రీగురుదేవుల దర్శన, సాహచర్యములలో అనుభవించి, సమాధానము పొందిన మనస్సుతో అన్య చింతనలను, సాంగత్యములను వదలి శ్రీ సద్గురుదేవుల సన్నిధిలోనే స్వస్వరూపలయం పొందారు.

తత్కారణంగా శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు వారి ధర్మపత్ని కూడ శ్రీ గురుదేవుల శ్రీ చరణములనే ఆశ్రయించుకుని సేవించుకున్నారు. ఆశ్రమ స్థాపన అనంతరం ఆ పుణ్యదంపతులు శ్రీగురు సేవలోను ఆశ్రమసేవలోను తమ చరమజీవితమును పునీతంచేసుకుని శ్రీసద్గురుచరణలయం పొందారు.

సుస్థిరమైన ఆ సద్గురుపాద సన్నిధి అనే వెలలేని పెన్నిధిని నా గురు సోదరులు శ్రీ విజయేశ్వరానంద ప్రసాద్ ఆశ్రయించుకుని సకుటుంబంగా శ్రీ గురుచరణ సేవకు, ఆశ్రమ సేవకు తమ్ము తాము అంకితం చేసుకున్నారు. వారి నలుగురు సంతానంలోను సద్గురుదేవుల కృపతో ముగ్గురు గృహస్థులై శ్రీగురు సేవ చేసుకుంటున్నారు. జ్యేష్ఠ కుమార్తె చిరంజీవి అరుంధతి శ్రీ సద్గురుసేవలో ఆశ్రమజీవితమును చక్కగా నెరవేర్చుకుంటున్నది.

వెంకటరత్నంగారు శ్రీగురుదేవుల దివ్య సంభాషణలలోని ముఖ్య అంశాలను సేకరించి పత్రికలకు పంపేవారు. శ్రీగురుదేవులు వారితో భక్తి ప్రధానములైన కీర్తనలను, నాటికలను రచింపజేసి, ఆశ్రమ బాలబాలికలతో ప్రదర్శింపజేసేవారు. ఆసమయాలలో ఎంతో ప్రేమతో శ్రీ గురుదేవులు "మా వెంకటరత్నం మా ఆస్థాన కవి" అని వారిని పిలుచుకునేవారు.

శ్రీ శరన్నవరాత్రి మహోత్సవాలలోను, అనేక సత్సంగ సమావేశాలలోను శ్రీ గురుదేవుల దివ్య సందేశ పూర్వక అనుగ్రహ భాషణములతో కూర్చిన

“శ్రీగురువాణి” గ్రంథం ప్రథమ భాగమును శ్రీ గురుదేవుల చరణ సన్నిధిలో సమర్పించారు. శ్రీ గురుదేవులు ప్రసన్నులై అపార వాత్సల్యంతో “విజయేశ్వరానంద ప్రసాద్” అని శ్రీ వెంకటరత్నంగారిని ఆశీర్వదించారు.

ఎందరెందరో భక్తులను కలిసికొని, శ్రీవారి మాహాత్మ్యమును వెల్లడించే ఎన్నో అమూల్యమైన సంఘటనలను, భక్తుల అనుభవాలను సేకరించి, ఎంతో శ్రమకోర్చి, శ్రద్ధా భక్తులతో మా గురుసోదరులు ‘శ్రీ సమర్థ సద్గురునాధుని దివ్యచరిత్ర’ అనే గ్రంథరాజము యొక్క మొదటి భాగమును శ్రీ సద్గురు చరణాలకు అంకితం చేసి భక్తలోకానికి సమర్పిస్తున్నారు.

విశ్వాత్మ స్వరూపులైన శ్రీ గురుదేవుల చరిత్ర వ్రాయటం అంత తేలిక కాదు. వారి సృష్టిలోని పంచ మహాభూతములలో గొప్పదైన ఆకాశమును, గాలినే బంధించలేము. ఇక అక్షర స్వరూపులైన శ్రీ గురుదేవులను అక్షరాలలో బంధించగలమా? అయినా పరమ కృపా సముద్రులైన శ్రీ గురుదేవులు తమను అనన్య భక్తితో ఆశ్రయించిన భక్తులకు అనంతము, అఖండము అయిన తమ ప్రేమ తత్త్వమును అందించకుండా ఉండలేరు. శ్రీ గురుదేవుల మహత్తర చరిత్రను చదువుకొని వారి అద్భుతలీలా వైభవమును తనివితీరా ఆస్వాదించాలని ఎన్నాళ్ళ నుండో ఆరాటపడుతున్న మహాభక్తులందరి మనోరథాన్ని నెరవేర్చటానికే, శ్రీ గురుదేవులు శ్రీ విజయేశ్వరానంద ప్రసాద్‌ను కరుణించి వారి లేఖినిలో ప్రవేశించి తమ్ము తాము అక్షరములలో పొదిగించుకొని, వారి చేత యీ పవిత్ర గ్రంథమును వ్రాయించుకున్నారు.

ఈ మొదటి భాగమును శ్రీ గురు కటాక్షంతో అందించిన శ్రీ విజయేశ్వరానంద ప్రసాద్‌ను మరొకసారి మనఃపూర్వకంగా అభినందిస్తూ, శ్రీగురుదేవుల దివ్యాశీస్సులను వారికి అందజేస్తున్నాను. అలాగే ఆశ్రమ ప్రవేశానంతరం శ్రీ సద్గురుదేవుల అద్భుత, అనంత చరిత్రలోని మరెన్నో అమూల్య విషయాలతోనూ, ప్రస్తుత భక్తులదివ్యానుభవాలతోనూ కూడిన యీ గ్రంథపు రెండవ భాగమును కూడ అందింప దలచిన వారి సత్సంకల్పము నిర్విఘ్నముగా నెరవేరవలెనని, అందుకు కావలసిన పరిపూర్ణమైన శారీరిక, మానసిక ఆరోగ్యమును, అఖండ భక్తి జ్ఞాన వైరాగ్యములను, సాధన సంపత్తిని, యితోధికశక్తిని శ్రీ సద్గురుదేవులు వారికి ప్రసాదింతురుగాక అని ప్రార్థిస్తున్నాను

శ్రీ సద్గురు చరణదాసి

Y S C Kaliprasada




(గతసంచిక తరువాయి)

-రమణ ప్రసాద్

జరిగిన కథ.......

కృష్ణవిహీనమై, నిర్మానుష్యంగా ఉన్న ద్వారకలోకి ఎంతో సంకోచంతో దారుకునితో అడుగు పెట్టాడు అర్జునుడు... అక్కడ దేవకి వసుదేవులను కలిశాడు... కృష్ణుని రాణులైన రుక్మిణి, సత్యభామలను కలిశాడు... వీరందరి సందేశాలను తీసికొని కృష్ణుని వెతుకుతూ హిరణ్ - కపిల సంగమస్థానానికి చేరుకున్నాడు... అక్కడ కృష్ణుని దేహత్యాగానికి నిమిత్తమాత్రుడైన జర తారసపడ్డాడు... ఆతర్వాత కుర్కటునితో తలపడి తాను కలలోనైనా ఊహించని ఘోర పరాజయాన్ని పొందాడు... ఈ పరాజయంకూడా నిమ్తితమే అని యుధిష్ఠిరుడు ఊరడిస్తాడు... అయితే అశ్వత్థామ చేతులతో నిద్రిస్తున్న ద్రౌపది పుత్రుల వధ .. అశ్వత్థామకు శిక్షరూపంలో లభించిన నరకతుల్యమైన యాతనకూడా నిమిత్తమేనా!... ఇక చదవండి.

ఉద్ధవుడు ఆకాశంవైపు చూశాడు. ఆ పరిసరాలలో యజ్ఞవేదినుండి లేచిన పొగ ఘనవృక్షాలలోనుంచి చొచ్చుకొని తన వైపుకి వస్తోంది... ఈ నైమిశారణ్యంలో ఉద్ధవునికి తెలియని త్రోవ ఒక్కటీ లేదు. దగ్గర ఉన్న ఆశ్రమంనుండి సంధ్యావందనం, అర్ఘ్యదానం జరుగుతున్నట్లుగా ఉన్నది. ఉద్ధవుడు గట్టిగా ఊపిరి పీల్చాడు. అతనికి అచ్చట వీస్తున్న మంద వాయువులలో నెయ్యి వాసన వచ్చింది.. అప్పటి వరకు ప్రచండంగా ఉన్న సూర్యుడు, వృద్ధుడైన తండ్రి అపరాధి అయిన తన పుత్రుని వైపు ఎలా క్రోధంగా చూస్తాడో అలా పృథివి వైపు చూస్తున్నాడు.

ఏకాకిగా ఉద్ధవుడు ఎప్పటినుంచో తిరుగుతూనే ఉన్నాడు. భాగీరథి ఒడ్డున అర్జునుని కలిశాడు. అతని వద్ద సెలవు తీసుకొని తాను తీర్థయాత్ర చేసే దిశను మార్చాడు. కృష్ణుడు ఏ శేష కార్యానికి

తనని నిమిత్తమాత్రుడిగా చేశాడో అది నెరవేర్చటానికి గోకులంవైపుగా ప్రయాణం సాగించాడు. ఒక సందేశం అందించటానికి...అదే కృష్ణుని దేహత్యాగం గురించిన సందేశం. అది ఎవరికి అందించాలో ఆమె ఎవరు?... రాధ! కృష్ణుడే స్వయంగా ఈ కార్యాన్ని తనకు ఒప్పగించాడు... సందేశం అందించటానికి తనని పాత్రధారిగా చేశాడు.

దేహధారి అయిన కృష్ణుడు దేహాన్ని విడిచినప్పుడు... ఆ క్షణంలో రాధను స్మరించాడు! రాధ ధన్యురాలు అయింది! ఆ ధన్యురాలైన రాధకు తను వెళ్ళి 'కృష్ణుడు ఇక లేడు' అని చెప్పటమా?... ఎలా చెప్పటం?... ఏ మాటలలో చెప్పటం?... ఏం చెప్పాలో తెలిస్తే కదా తను చెప్పగలిగేది... ఆవిడ ఎలా వింటుంది? తాను చెప్పినదానిని ఎలా సహించగలుగుతుంది?...

గోకులాన్ని విడిచి మధురకు వచ్చినరోజున... ఆరోజు ఉద్ధవుడు కృష్ణునితోనే ఉన్నాడు! ఆ రోజును ఉద్ధవుడు ఎన్నటికీ మరవలేడు! అక్రూరుడు వచ్చి నందునితో - 'నందరాజా! కృష్ణ బలరాములను కంసుని సభలో ధనుర్యజ్ఞంలో పాల్గొనటానికి తీసుకువెళ్ళటానికి వచ్చాను.' అక్రూరుడు జ్ఞప్తికి రాగానే ఉద్ధవునికి ముఖంలో శుష్కమందహాసం వెలువడింది. వృష్ణి సంఘంలో వరిష్ఠుడైన అక్రూరుడు సంఘరాజ్య పతనానంతరం కంసుని కొలువులో చేరటానికి ఒప్పుకొన్నాడు.

ఆ ఘటనా క్రమమంతా ఉద్ధవుని మనస్సులో మెదిలింది. కంసుని బలపరాక్రమాలకు అక్రూరునివంటి సంఘపతి తలఒగ్గాడు... మారుమాట పలకకుండా కంసుని కుటిల వ్యూహాలలో పాలు పంచుకున్నాడు, కృష్ణుని వధించటానికి ఆయోజితమైన మల్లయుద్ధం ధనుర్యజ్ఞం. ఈ షడ్యంత్రం గురించి అక్రూరునికి తెలియకపోలేదు.

ఈ ప్రసంగం అంతా ఉద్ధవుని కలచివేసింది. మనశ్శాంతికోసం ఉద్ధవుడు దగ్గరగా ప్రవహిస్తున్న నీటిలో దిగి మధ్యాహ్న స్నానం చేశాడు. ఆ చల్లటి నీటిలో స్నానం చేసి ఆ చేదు స్మృతుల నుండి బయట పడ్డాడు. సాయంత్రమౌతోంది. కళ్ళు తెరచి చూశాడు. ఆ నది ఒడ్డున కూర్చుని కృశించిన దేహంతో నిస్తేజంగా ఉన్న ఒక పురుషుడు తన తలపైన నీరు చల్లుకుంటున్నాడు.

ఉద్ధవుడి దృష్టి అతనిపై పడి స్థిరంగా నిలిచింది. ఆ దృష్టి తనకు తాకినట్లు ఆ పురుషుడు తలఎత్తి ఉద్ధవునివైపు చూశాడు. అతని కళ్ళు లోతుకి దిగి లోతైన గుహలను జ్ఞప్తికి తెస్తున్నాయి. అతని వదనం రక్తహీనంగా ఉంది. ముఖంలో ప్రేతకళ ఉట్టిపడుతోంది. ఆచ్ఛాదనం లేని ఒంటిమీద యజ్ఞోపవీతం ధరించి ఉన్నాడు. ఒకప్పుడు అతడు శస్త్రాలను ధరించిన చిహ్నాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. కుడిచేతితో తలపట్టుకొని అతడు ఉద్ధవుడి వైపు చూశాడు. అతని పెదవులు వణికాయి. శరీరం కంపించింది... ఉద్ధవుడు అతనిని రెప్పవాల్చకుండా చూస్తూ ఉండిపోయాడు.

"అశ్వత్థామా!" ఉద్ధవుడు అతనిని గుర్తుపట్టి "నీకు ఈ దుర్దశ ఏమిటి?" అని అడిగాడు. ఆశ్చర్యం! ద్రోణుని సమర్థవంతుడైన పుత్రుడు... కౌరవరాజైన దుర్యోధనుని పరమ మిత్రుడు... ఇతడికేమైంది? చర్మంతో కప్పిన ఎముకల పంజరంలా ఎలా అయిపోయాడో! ఎంతటి సుదృఢమైన దేహం అశ్వత్థామది...ఎలా క్షీణించిపోయి భయానకంగా కనిపిస్తున్నదో!

"ఉద్ధవా..." మాటలు కూడా వణుకుతున్నాయి, అశ్వత్థామ శరీరం కూడా వణుకుతోంది. తన అగమ్య స్థితినుండి తేరుకొని పరిగెత్తుకుని వెళ్ళి ఉద్ధవుడి చరణాలపై వ్రాలాడు. అతని శరీరం కంపిస్తోంది. ఉద్ధవుడు అతనిని లేవనెత్తి అతని తలవైపు చూస్తూ ఉండిపోయాడు... అతని తలమీద పెద్దగాయం!... ఆగాయంలోనుంచి దుర్గంధం వస్తోంది. కాని అప్పుడే తగిలిన గాయమల్లే చీము, రక్తం ప్రవహిస్తున్నాయి. ఉద్ధవుడికి అర్థమైంది! అర్జునుని చేతులలో మణివిహీనుడై, కృష్ణుని చేత అభిశపింపబడి ఈ బ్రాహ్మణుడు తాను చేసిన పైశాచిక కృత్యానికి ఫలం అనుభవిస్తున్నాడు!

"వత్సా కళ్యాణమస్తు!" అని ఉద్ధవుడు తన దక్షిణ హస్తాన్ని అతని తలపై గాయమైన చోట పెట్టాడు... అశ్వత్థామ కళ్ళు మూసుకొన్నాడు... ఆ స్పర్శ! ఉద్ధవుని వేళ్ళు... ఆ వేళ్ళ స్పర్శలో ఎంత శాంతి? ఆ స్పర్శలో ఎంత హాయి! ఆశ్వత్థామ అలా చాలాసేపు ఉండిపోయాడు. అతని మూసిన కన్నులనుంచి అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి.

'ఉద్ధవా!' అశ్వత్థామ పెదిమలు వణికాయి. "మీ చేయి నా తలపైన అలాగే ఉంచండి. ఎన్నో సంవత్సరాల తర్వాత... ఎన్నో యుగయుగాంతరాల తర్వాత మీ స్నేహ పూర్వకమైన స్పర్శతో నాకు శాంతి లభించింది!" ఉద్ధవుడు నెమ్మదిగా అశ్వత్థామ మలిన శరీరాన్ని చేతితో నిమిరాడు. ఆ శరీరం మీద మట్టి ఇసుక దట్టంగా అంటుకొని ఉంది. దవడలమీద నుంచి జారిన అశ్రువులు అతని ఘన జటాజూటాలలో పడి లీనమవుతున్నాయి.

"అశ్వత్థామా!" అప్పటికి అశ్వత్థామ కొంచెం స్థిమితం పొందాడు. అప్పుడు తన వద్ద కూర్చోబెట్టుకుని ఉద్ధవుడు అడిగాడు. 'కురుక్షేత్ర సంగ్రామం ముగిసిన తర్వాత ~~ఈ~~రోజున, ఇన్ని సంవత్సరాల తర్వాత నీ జాడ తెలిసింది నాయనా. ఇన్నాళ్ళూ నువ్వు ఎక్కడ ఉన్నావు?

"ఉద్ధవా! నేను ఎక్కడలేను? అని అడగండి. అశ్వత్థామ పెదవులపై మందహాసం విరిసింది. ఎవరి దృష్టీ పడకుండా పారిపోతూ ఉంటాను. ఎక్కడెక్కడో తిరుగుతూ ఉంటాను. నేను ఏ మానవుని కంటపడకుండా గడిపాను. ఇంతలో మీ దర్శనమైంది...!" అశ్వత్థామ ఉద్ధవునివైపు చూస్తూ ఉండిపోయాడు... "అంతా కర్మాధీనం వత్సా!" దీర్ఘంగా ఊపిరిపీలుస్తూ అన్నాడు ఉద్ధవుడు."ఆ రోజు ప్రాభాతాన కురుక్షేత్రంలో జరిగిన ఆ సంఘటన తరువాత ఎంత కాలం గడిచింది ఉద్ధవా?" అని అశ్వత్థామ పశ్నించాడు. అతని కళ్ళలో ఒక కాంతి విరిసింది. అతడు తిరిగి "స్వామీ! మూడువేల సంవత్సరాలు పూర్తికావటానికి ఇంకా ఎంత కాలం మిగిలింది?" అని అడిగాడు.



-సశేషం

## వార్తా కదంబం

76వ శ్రీ రామకోటి మహోత్సవ బ్రహ్మోత్సవములు శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘము, శ్రీరామనామ క్షేత్రము, గుంటూరు వారిచే ది.14.12.08 నుండి 19.12.08 వరకు నిర్వహింపబడ్డాయి.. పూజ్య శ్రీ మాతాజీవారు ది.16.12.08న మహా సంకీర్తనము చేసి అనుగ్రహ భాషణం చేశారు. ఈ కార్యక్రమంలో ఎంతో మంది భక్తులు పాల్గొన్నారు.



శ్రీహనుమత్సమేత దత్తసాయిసేవా సంఘము వారు శ్రీసాయిదేవుని పుష్కరోత్సవము, శ్రీ వీరాంజనేయ స్వామివారి వార్షికోత్సవం పురస్కరించుకుని నిర్వహించిన5 రోజుల కార్యక్రమాలలో ది.19.12.08 (మొదటి రోజున) ఉదయం 9 గంటలనుండి 12 గంటలవరకు పూజ్య యోగిని శ్రీ చంద్ర కాళీ ప్రసాద మాతాజీవారు మహా సంకీర్తన, అనుగ్రహభాషణం చేశారు.



21-12-08 ఆదివారం భద్రాచలంలో నైమిశారణ్యంలో శ్రీమాతాజీవారి సంకీర్తన సత్సంగ సమావేశం జరిగాయి.

డిసెంబర్ 29 నుండి ముంబై నగరంలో జరిగిన సత్సంగాలు అయ్యప్ప సంఘం వారి ఆధ్వర్యంలో నిర్వహింపబడ్డాయి.

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,